# చదువు అంటే ఏంటి?
# చదువులెందుకు??

## (విద్య గురించి విభిన్న భావాలు)




సంపాదకత్వం & సంకలనం

**గౌరవ్**

# చదువు అంటే ఏంటి?
# చదువులెందుకు??

**(విద్య గురించి విభిన్న భావాలు)**

సంపాదకత్వం & సంకలనం
గౌరవ్

ప్రచురణ
సెంటర్ ఫర్ సోషల్ జస్టిస్
ఆంధ్రప్రదేశ్ - తెలంగాణ

మొదటి ముద్రణ
మే, 2020

ప్రతిపాదిత చందా
20/- రూపాయలు

విజ్ఞప్తి
ఇందులోని వ్యాసకర్తల అభిప్రాయాలు
అన్నింటితోనూ సంపాదకుడు ఏకీభవించనక్కర్లేదు

కొటేషన్స్ కర్టసీ
పతంజలి భాష్యం

ప్రతులకు
9032094492

వివరాలకు
gouravmeka@gmail.com

# ప్రస్తావన

"The plain fact is that the planet does not need more "successful" people. But it does desperately need more peace makers, healers, restorers, storytellers and lovers of every shape and form. It needs people who live well in their places. It needs people of moral courage willing to join the fight to make the world habitable and humane. And these needs have little to do with success as our culture has defind it."

– **DAVID ORR,** What is Education for?

చదువంటే చేయడమే. చేయడం నుండి విడివడి ప్రత్యేకంగా చదవడం అంటూ ఏది ఉండదు. తెలుసుకోవడం, నేర్చుకోవడం, ప్రయత్నించడం, ప్రశ్నించడం, తర్కించడం, చేయడం... అదే చదవడం.

సమాజం ఎలా ఉందో తెలుసుకోవడం, ఎలా ఉండాలో నేర్చుకోవడం, మార్చడానికి ప్రయత్నించడం, మారని దానిని ప్రశ్నించడం, ఎందుకు ఇలా ఉందో తర్కించడం, మార్చడం... ఇదే చదవడం.

చదువు ఒక సమిష్టిసాధన, వ్యక్తిగత వ్యవహారం కాదు. చదువు ఒక నిరంతర శోధన, సంకుచిత చట్రం కారాదు. చదువు సత్యాన్వేషణ, పిడివాదం కానేరదు.

శతాబ్దాల నుండి మానవాళి తరతరాలుగా సముపార్జించుకున్న విజ్ఞానం చదువు. యుగయుగాలుగా మనిషి ఏర్పర్చుకున్న భావజాల స్రవంతి చదువు. చదువు సామరస్యరూపం, సంకల్పసారం.

అలాంటి చదువు అసలెప్పటికీ నాలుగ్గోడలకి పరిమితం కాదు, కాలేజీలు, విశ్వవిద్యాలయాలు అనంతమయిన విద్యకి చిరునామాలు కాదు. చదువు చిరునామా వెలుగు.

వ్యవస్థలోని అవాంఛనీయమయిన చీకట్ల నుండి సంఘాన్ని కాంతివంతం చేసేదే విద్య. అసాంఘిక ఇక్కట్ల నుండి మానవాళిని మళ్ళించేదే ప్రజ్ఞ. అదే విశ్వవిజ్ఞానాన జగతికి అభ్యాసమందించిన ప్రగతి. అందుకే,

**చదవడం ఒక అర్థవంతమైన కార్యాచరణ కావాలి.**

**Education must be a meaningful act.**

# లోపల...

| | | | |
|---|---|---|---|
| 1. | చదువులు – కొత్త దారులు | – డా॥ సి.ఎ. ప్రసాద్ | 7 |
| 2. | తరగతి గది రంగస్థలం అయితే... ఫలితం అద్భుతం! | – కె. శాంతారావు | 10 |
| 3. | విద్యాసమమ్ నాస్తిశరీరభూషణమ్ | – కట్టా కృష్ణారావు | 13 |
| 4. | చదువంటే ఏమిటి ? అసలు చదువెందుకు ? | – డా॥ పి. యస్. ప్రకాశరావు | 17 |
| 5. | చదువు : ఒక విశ్లేషణ | – వేణుగోపాల్ వర్మ | 21 |
| 6. | సమగ్ర వికాసమే విద్యా లక్ష్యం | – ఎస్. ఆర్. పరిమి | 24 |
| 7. | ఈ చదువులెందుకు? | – గౌరి | 30 |
| 8. | చదువంటేనే విజ్ఞానం–చదవకపోతే అజ్ఞానం | – మలయశ్రీ | 32 |
| 9. | పెద్దలు పిల్లలతో చాలా నేర్చుకోవచ్చు | – ప్రభ | 34 |
| 10. | చదువంటే? | – డి.ఆర్. ఇంద్ర | 36 |
| 11. | విద్య–దాని ప్రాముఖ్యత | – Sk. కరీముల్లా | 38 |
| 12. | బహుజనులకు చదువే సర్వం | – పిల్లా చంద్రం | 39 |
| 13. | చదువు గుదిబండ కాదు | – కృష్ణవేణి | 41 |
| 14. | విద్య–విజ్ఞానం | – నారాయణశర్మ | 43 |
| 15. | బ్రాహ్మణులు ఏ వృత్తి అయినా చేయవచ్చును కానీ, ఉపాధ్యాయ వృత్తి మాత్రం చేయరాదు – మహాత్మా ఫూలే | – రేకా చంద్ర శేఖర రావు | 45 |

## అంకితం

**ఈ అమానవీయ విద్యావ్యవస్థ బారిన పడి**

**ఆత్మహత్యలు చేసుకున్న అభాగ్యులు,**

**ఈ కరోనా కష్టకాలంలో కాళ్ళనే నమ్ముకున్న వలస కార్మికులందరికీ**

**ఆవేదనతో..**

# సంపాదకుడి మాట

చాలా ఏళ్ళ నుండి పెండింగ్‌లో ఉన్న ప్రాజెక్ట్ ఇది. సమగ్రంగా కాకపోయినా ఇప్పటికి ఈ రూపంగా వచ్చింది. ఐదారేళ్ళ క్రితమే విద్యకి సంబంధించిన వ్యాసాలతో ఒక ప్రచురణ తీసుకురావడానికి ప్రయత్నించాను. డా॥ పరిమి, ఫయాజ్, సత్యతీర్థ వంటి మిత్రులు మెటీరియల్ కూడా పంపించారు. అనేక కారణాల వల్ల ఆ పని కాలేదు. అప్పుడు సేకరించిన ఆంగ్ల వ్యాసాలని ఇందులో చేర్చడం లేదు. కొన్ని వ్యాసాలు పోగొట్టుకున్నాను. ఆ వ్యాసాలు పోగొట్టుకున్నందుకు నేనెన్నటికీ క్షంతవ్యుడ్ని కాలేను. మళ్ళీ, ఇన్నాళ్ళకిలా లొంగుబాటుని అంగీకరించక తోచినంతలో చేసిన ఒక చిన్న ప్రయత్నం తాలూకు ఫలితమిది. కరోనా లాక్‌డౌన్ కారణంగా దొరికిన ఖాళీని పూరిస్తూ పూర్తిగా ఉపాధ్యాయులు, విద్యతో సంబంధమున్న వ్యక్తుల వ్యాసాలతోనే తెస్తున్న సంకలనం ఇది.

నిజానికి ఆ మధ్య కాలంలో **'విద్య అధ్యయన వేదిక'** పేరిట రెండు ప్రచురణలు తీసుకురావడం జరిగింది. విద్యా విధానాల గురించి ప్రత్యామ్నాయ పద్ధతుల్లో దేశవ్యాప్తంగా అధ్యయనం చేస్తున్నవారు, ప్రయోగాలు చేస్తున్న మిత్రులు ఎంతోమంది ఉన్నారు. నా పరిమితుల్లో వీలున్నప్పుడల్లా ఆయా ప్రయత్నాల గూర్చి తెల్సుకునే, కుదిరితే అలాంటి వార్ని కల్సుకునే యత్నం చేస్తూనే ఉన్నాను. ఇవాన్ ఇల్లిచ్, పాలో ఫెరి, జాన్ హోల్ట్, జాన్ డ్యూయి, నీల్, జాన్ టేలర్ గాట్టో, రస్సెల్, కిష్ణ కుమార్, నీల్ పోస్ట్‌మెన్ వంటి ఎందర్నో పనికట్టుకుని అధ్యయనం చేసాను. జ్ఞానాన్ని విస్మరించిన సమాజం మూఢత్వంలో మునిగి తేలుతూ అజ్ఞానాన్ని ఆరాధిస్తుంది.

ఈ రోజు విద్య పేరిట జరిగే తతంగాలన్నింటిదీ ఇదే కథ. మనుషుల్ని ఉద్యోగస్తులుగానో, ఉపాధి కోసం దేవులాడే వేతన రుణగ్రస్తులుగానో కాక వ్యక్తులుగా మలిచే చదువులు అరుదు. సమాజ ఉన్నతి కోసం, సాటి మనిషికి తోడ్పాటునందించడం కోసం, అక్రమాల్ని – అసమానతల్ని ప్రశ్నించడం కోసం రాటుదేరాల్సిన విద్యా–విజ్ఞానాలు, కొద్దిమంది ఖరీదైన జీవులకి చాకిరీ చేయడం కోసం, ఉన్న స్థితికి ఊడిగం చేస్తూ మార్పుని వ్యతిరేకించడం కోసం స్వచ్ఛందంగా సిద్ధపడుతూ స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల ప్రాముఖ్యతని స్వార్థం కోసం విస్మరించడం ఈరోజు స్పష్టంగా కనబడుతున్న వాస్తవం.

మనుషుల్ని యాంత్రికంగా జమకట్టే సంకుచిత ధోరణులు బలంగా పెత్రేగుతున్న ప్రతీ దశలోనూ మానవాళి జీవన సారాన్ని చాటిచెప్పే విశాల దృక్పదాలు అవసరం.

"We are still a people who enjoy only the smallest percentage of literacy, and we have so far been excusably stupid about the whole matter of education." అంటాడు ముల్క్‌రాజ్ ఆనంద్ "On Education" అనే తన రచనలో. ఈనాటికీ ఎంత నిజమో అనిపిస్తూ ఉంటుంది. A Nation of illiterates అంటాడాయన.

ప్రాథమిక విద్య మొదలుకుని విశ్వవిద్యాలయాల పి.హెచ్‌డి పట్టాల వరకూ ఈరోజున్న మొత్తం విద్యావ్యవస్థలన్నీ శుద్ధ అర్థరహిత వ్యర్థపు వ్యాయామాలని నా అభిప్రాయం. అందుకే ఇప్పుడెవరైనా ఇన్నేసి డిగ్రీలు పొందామన్నా, ఎన్నేసేళ్ళో పడిపడి చదివి పట్టాలు సంపాయించామన్నా జాలేస్తుంటుంది. స్థాయీబేధాల్ని చెరిపేయడానికి కావాల్సిన చదువు, సరికొత్త హెూదాలు తగిలించుకుని మూసలో సాగడానికి చిహ్నం కావడం చిత్రం. అందుకే మనకి చదువుకున్న విద్యావంతులు, ఉద్యోగులు ఉంటారు కానీ ఆలోచనాపరులు, ఆచరణాశీలురు తక్కువ.

చదువు సంపాదనలో కాదు సంస్కారంలో ప్రతిబింబించాలి. జ్ఞానానికి పట్టాలుకాదు ప్రవర్తన ప్రమాణం కావాలి. నిజమయిన ఔన్నత్యం నిరాడంబరతే కానీ ఆడంబరత్వం కాదనే నిజం గ్రహించాలి. అలా విద్యని గురించి విభిన్న భావాలకి చోటు కల్పించడం కోసం చేసిన చిన్న పని ఇది. ప్రస్తుత స్థితిలో ఈ అక్షరాల ప్రాధాన్యత గుర్తించేందుకు ముందుకొచ్చే ఏ ఒక్కరికయినా ఒక్క ముందడుగు వేసేందుకు అవసరమయిన అర్థవంతమయిన స్ఫూర్తిని ఈ ముద్రణ అందించగలిగితే అంతకుమించిన సంకల్పసిద్ధి దీనికి మరేదీ లేదనేది నా అభిప్రాయం, సెలవు.

"The illeterate of the 21st Century will not be those who cannot read and write, but those who cannot learn, unlearn, and relearn." – Alvin Toffler

* * *

# 1. చదువులు - కొత్త దారులు

– డా॥ సి.ఎ. ప్రసాద్, సింగరాయకొండ, సెల్ : 9490175160

80 సం॥రాల క్రితం ఒక పెద్దాయిన చెప్పిన జీవిత సత్యం మనకు అర్ధమైతే మన చదువుల విధానం వేరే రకంగా ఉండేదేమో కదా. 1937లో మహారాష్ట్రలోని వార్ధాలో 3 రోజులపాటు జరిగిన విద్యావేత్తల సమావేశంలో గాంధీజీ మాట్లాడుతూ, ఈ దేశ పిల్లలకు సరైన విద్య కావాలంటే పనినీ, చదువులను కలపాలని చెప్పారు. దానినే ఆయన నయీ తాలీమ్ (కొత్తచదువు) లేదా New Education అని పిలిచారు. తదనంతర కాలంలో మన దేశానికి రాష్ట్రపతిగా చేసిన ప్రముఖ విద్యావేత్త జకీర్ హుసెన్ అధ్యక్షతన జరిగిన ఈ సమావేశం విద్యారంగంపై సమీక్ష చేసి, Holistic development of a child అంటే Head-Heart-Hands-Hounour అనుసంధానించి చదువుండటమే నయీ తాలీమ్ అంది. జీవితానికి అడుగడుగునా ఉపయోగపడేది 'చదువు', కాబట్టి చదువులు / నేర్చుకోవడం అనేది జీవిత అనుభవాలకు అనుగుణంగా జరగాలని ఆనాటి చర్చల సారాంశం. కేవలం మన దేశంలోనే కాదు ప్రపంచంలో మనం ఏ విద్యావేత్తను గమనించినా ఏదో ఒక రూపంలో చెప్పిన సారాంశం ఇదే.

గాంధీ జీవితకాలంలోనే గుజరాత్‌లో గిరిజాశంకర్ బగేకా / గిజుభాయ్ అనే ఆయన పిల్లల కోసం ఒక 'మేనిఫెస్టో' రాసారు. 'మీసాల అమ్మ' అని పిలుచుకునే ఆయన కవితల్లో ఒకటి;

**"మతం గురించి మాట్లాడుతూనో,**
**సంప్రదాయానుసారం కర్మకాండలు చేస్తూనో**
**ప్లిలలకు మతైక దృష్టి కలిగించలేం.**
**మతం, పుస్తకాల్లోనో వ్యక్తుల్లోనో**
**చచ్చిన పిడి సిద్ధాంతాల్లోనో లేదు**
**జీవితంలోనే ఉంది.**
**అమ్మానాన్న టీచర్లు పెద్దలు – ఇలా**
**జీవిస్తూ ఉంటే, సహజంగానే పిల్లలు**
**కూడా ఈ విద్యను పొందగలరు."**

"చిన్నారుల నిజమైన అభివృద్ధికి అవసరమైనవి మంచివి, తక్కువ ఖర్చుతో వచ్చేవి ఆటస్థలాలే." అనే ఆయన, "చిన్నారులతో పనిచేయడం, వాళ్ళ ప్రవృత్తిని అర్థం

చేసుకోవడం, చిన్నారుల్ని నమ్మడం, ప్రేమించడం చాలా కష్టం. అందుకోసం పై నుంచి కింది వరకూ చాలా చెమట కక్కవలసి ఉంటుంది" అన్నారు. "భయాన్ని, లోభాన్ని, జయించగలిగేదే నిజమైన విద్య" అంటారు గిజుబాయి.

ప్రస్తుతం మనం అవలంభిస్తున్న చదువుల విధానం Adult Centered or Teacher Centered Education. రాయించడం, చదివించడం, బట్టీ పట్టించడం ర్యాంకుల కోసం కోచింగ్‌లు ప్రైవేటు, ప్రభుత్వం కూడా ఈ పద్ధతినే అనుసరించడం చూస్తున్నాం. ఐతే, Holistic Education లక్ష్యంగా Child Centered గా పనిచేస్తున్న కొన్ని విద్యాసంస్థలు దేశంలో ఉన్నాయి.

* జిడ్డు కృష్ణమూర్తి ఆధ్వర్యంలో మొదలయిన రిషీ వ్యాలీ వంటి విద్యాసంస్థలు K.F.I. ఆధ్వర్యంలో నడుస్తూ కార్పొరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ అనే పదాలు వినబడని ఆ రోజుల్లోనే పల్లెల్లోని పిల్లలకోసం రూరల్ ఎడ్యుకేషన్ సెంటర్ పేరిట శాటిలైట్ స్కూల్స్‌ని ప్రారంభించాయి.
* David Harsboraoh పనినీ, విద్యనీ (క్రాఫ్ట్ వర్క్, అకడమిక్స్) సమ్మిళితం చేస్తూ స్థాపించిన నీల్ బాగ్ స్కూల్.
* ఉషా నరసింహన్ ప్రయోగాత్మకంగా ఏర్పర్చిన సుమవనం.
* శివరాం, ఎలియనార్ వాట్స్ కల్సి నెల్లూరు జిల్లా పల్లెపాడు గాంధీ ఆశ్రమంలో 8 సం॥రాలుకి పైగా నడిపిన 'సృజన' స్కూల్.
* అనంతపురం జిల్లాలో చెన్న కొత్తపల్లి మండలంలోని Timbaktu సంస్థ ఆరంభించిన "ప్రకృతి బడి" మిత్రుడు, లేటు సుబ్బరాజు పిల్లలకోసం పెట్టిన కొత్తపల్లి పత్రిక, ఇప్పుడు నారాయణ నడుపుతున్నారు.
* కొడైకెనాల్‌కి 30 కి.మీ. దూరంలో (బ్రెయిన్ జెన్కిన్స్) కేంబ్రిడ్జి సిలబస్‌తో 100 ఎకరాల్లో షోలాయ్ స్కూల్.
* మీనాక్షి గారి Puvidham స్కూల్.
* మధ్యప్రదేశ్‌లో నర్మదానది గ్రామాల్లో ఆదర్శిల లెర్నింగ్ సెంటర్. అదే మధ్యభారతంలో ఇండోర్ దగ్గర భిల్ ఆదివాసీ తెగలతో సుభద్ర, రాహుల్జీ చేస్తున్న ప్రయోగాలు.
* ప్రొ. సుధాకర్, ఉషారాణి, స్వామి సత్యతీర్థ కలిసి పిల్లలకోసం పాల్వంచలో చేసిన హరితవనం.

ఇలా చెప్పుకుంటూపోతే వికాస భారతి (రామచంద్రరావు గారి కలలపంట) పరిమిగారి వికాస విద్యావనం, అభ్యాస, చేతన, కోటేశ్వరరావు గారి మెమోరియల్ స్కూల్, అరవింద, తేజ, చంద్రలత ప్రభవ, రిషీకేశ్‌లోని స్వామి శివానంద విద్యాలయం, సేవాగ్రాంలోని ఆనందనికేతన్, బాబా ఆమ్టే కుటుంబం చంద్రాపూర్ దగ్గర ఏర్పాటు చేసిన ఆనందవన్ / స్వరానందవన్, భాగవతుల ఛారిటబుల్ ట్రస్ట్ స్కూళ్ళు, గ్లోబల్ ఎయిడ్, శోధన, రామా స్కూల్ ఆఫ్ ఎక్సలెన్స్, అరకు దగ్గర గ్రామాల్లో థింక్ పీస్ గ్రూప్, ఫౌండేషన్ స్కూల్, పరివర్తన / ప్రజా విద్యాలయం, కాకినాడ, కావలి చైల్డ్ ఆశ్రమం, పూనాలో విజ్ఞానాశ్రమ్, హీల్ పారడైజ్, డి.డి.ఎస్. / జహీరాబాద్ దగ్గర పచ్చశాల స్కూల్, చీమకుర్తి శాంతివనం, పార్వతీపురం జట్టు ఆశ్రమం, స్వచ్ఛ చల్లపల్లి, ఏకలవ్య చేస్తున్న యత్నాలు, ఇవే కాక అరవింద్ గుప్తా మొదలుకుని వ్యక్తులుగా, సంస్థలుగా క్రియ, పడాల చారిటబుల్ ట్రస్ట్, మానవతా మిత్రమండలి, P.G.N.F., జై సీతారాం, మన లైబ్రరీ, SAHES, హమారీ మిట్టి, అరవింద వంటి ఎందరో వ్యక్తులు మరెన్నో ఎన్నదగిన ప్రయత్నాలు చేసిన, చేస్తున్న వారున్నారు.

ఇవాల్టి టీచర్ రోల్ ముఖ్యంగా, (1) లెర్నింగ్ ఎన్విరాన్‌మెంట్ క్రియేటర్, (2) కల్చరల్ యాక్టివిస్ట్, (3) ఎవాల్యూషన్, (4) ఇన్నోవేషన్, (5) రీసెర్చ్ ఓరియంటేషన్, (6) ఎక్స్‌పర్‌మెంటేషన్, (7) రోల్ మోడల్, (8) లీడర్ / కౌన్సిలర్, (9) కమ్యూనికేటర్, (10) స్టూడెంట్ ఫ్రెండ్లీ నేచర్, (11) కంటిన్యువస్ లెర్నర్ వంటి లక్షణాలపై ఆధారపడి ఉంటుంది.

ఈ క్రమంలో బాలోత్సవాలు, వర్క్ షాపులు, పుస్తకాలతో స్నేహం, కథలు, డ్రామాలు, డ్రాయింగ్ వంటి వాటి ద్వారా బోధన, ఇంకా ఉపాధ్యాయుల్ని ప్రోత్సహించే సద్గురు అవార్డులు, వివిధ రకాలయిన పురస్కారాలు, భిన్న సామర్థ్యం గల పిల్లలపై ప్రత్యేక శ్రద్ధ, అలాగే ఆడపిల్లలు, చిన్నప్పుడే పిల్లలపై జరిగే హింస, లైంగిక వేధింపులకి వ్యతిరేకంగా అవగాహన కలిగించే కార్యక్రమాలు ఇవన్నీ అవసరమే. చదువులు – కొత్త దారులు, CONNECT కూడా టీచర్ల అనుభవాలు విందామంటూ పాఠమే పాటగా, చదువే ఒక ఆటగా ప్రకాశం జిల్లాలో మేం చేసిన ప్రయత్నమే. అలా నూతన దారుల్లో పిల్లల చదువుకి సంబంధించి చేసిన ప్రయోగాలు మరింత విస్తృతం కావాలనేదే నా కోరిక.

* * *

# 2. తరగతి గది రంగస్థలం అయితే... ఫలితం అద్భుతం!

– **కె. శాంతారావు,** పెడన, సెల్ : 9959745723

అదో చౌరస్తా. వాహనాల రణగొణ ధ్వనులతో, జన సమ్మర్ధంతో నిత్యం రద్దీగా ఉంటుంది. మిట్టమధ్యాహ్నం... నిరుపేద సంచార జీవనం చేసే కుటుంబం ఒకటి మూటముల్లెతో ఒక ప్రక్కకు చేరుకున్నది. కొద్దిపాటి ఖాళీ జాగా చూసుకుని తాత్కాలిక మజిలీ ఏర్పరచుకుంది.

తల్లి, తండ్రి, ఓ పాప (పన్నెండేళ్ల వయసు), ఒక బాబు (పదేళ్ల వయసు) – మొత్తం నలుగురున్న కుటుంబం అది. తండ్రి మూట విప్పి ఓ సమ్మెట, తాడు, 2 గడ్డపారలు తీసి, పని మొదలుపెట్టాడు. తల్లి డోలు వాయిస్తూ హిందీ పాటలు పాడుతున్నది. అందరివి చింపిరి బట్టలే. పొడవాటి గడ లు నిలబెట్టి, మధ్యలో తాడు బలంగా కట్టి, తాడుపై నడవడానికి అనువుగా తండ్రి ఏర్పాటు చేశాడు. బాబు అరమీటర్ వ్యాసం కూడా లేని ఇనుప రింగులో శరీరాన్ని చకచకా దూరుస్తూ చూసేవారికి వింత గొలుపుతున్నాడు. ఒక చేయి, ఒక కాలుతో కూడా శరీరాన్ని ఈ చివర నుండి ఆ చివర వరకు పోనిస్తున్నాడు. పాట – డోలు శబ్దం – పిల్లవాడి విన్యాసంతో ప్రేక్షకులు గుమికూడటం ప్రారంభించారు.

పాప తండ్రి భుజాల పైకి ఎక్కి బ్యాలెన్స్ కోసం గడ (రెండు చేతులతో అడ్డంగా) పట్టుకుని తాడుపై నిలిచింది. తల్లి, తండ్రి, బాబుతో బాటు ప్రేక్షకులందరూ ఆ పాప వంకే చూస్తున్నారు. ఆ పాప తాడుపై అవలీలగా ఆ చివర నుండి ఈ చివరకు వెనక్కి, ముందుకు నడుస్తున్నది. ప్రేక్షకుల చప్పట్లు మోగుతున్నాయి. కొందరు ఈలలు వేస్తున్నారు. తల్లి సంతోషంతో పాట శృతిని, వేగాన్ని పెంచింది. తండ్రి, తమ్ముడు కూడా సంబరపడుతున్నారు.

ఈసారి పాప సరిగ్గా తాడు మధ్యకు వచ్చి నిశ్శబ్దంగా స్థాణువులా కదలకుండా నిలబడింది. తల్లి కూడా పాటను, శబ్దాన్ని ఆపి తదేకంగా పాపవైపే చూస్తున్నది. తండ్రి, తమ్ముడు తాడు కట్టడానికి ఉపయోగించిన రెండు గడలలో చెరో దాని దగ్గరకు వెళ్ళి కదలకుండా గట్టిగా పట్టుకున్నారు.

దర్ మత్ బేటా... ఠీక్ సే కరూ.. అంటూ తండ్రి పాపకు జాగ్రత్తలు చెబుతున్నాడు. ఇప్పుడు ఏం జరగబోతుందోనని ప్రేక్షకులు వుగ్గ పట్టుకుని రెప్ప వాల్చకుండా చూస్తున్నారు.

ఒక్కసారిగా పాప 'హూప్' అంటూ రెండు కాళ్ళతో ఒకేసారి పైకి లేచి మళ్లీ తాడుపై నిలిచి బొటన వ్రేళ్ళతో జాగ్రత్తగా తాడును పట్టుకుని గడతో బ్యాలెన్స్ చేసుకుని కింద పడకుండా యధావిధిగా తాడు మీద నిటారుగా నిలబడగలిగింది.

ఈ పాప చేసిన విన్యాసానికి కలా – నిజమా అన్నంతగా జనం ఆశ్చర్యపోయారు. విస్మయం చెందారు. చప్పట్లు కొట్టారు. డబ్బులు ఇచ్చారు. మనఃపూర్వకంగా మనసులోనే అభినందించుకుంటూ వెళ్లిపోయారు.

సర్కస్ అనేది ప్రాణాంతక కళ. ఇక్కడ రసరాజు అద్భుతం. బరువు – సమతూకం – గరిమనాభి వంటి గణిత సూత్రాలు ఉన్నా... వారికి విద్య లేదు కాబట్టి అవి తెలియవు. కానీ జీవితానుభవంతో వాటిని అన్వయించుకుని ఈ ఫీట్లు చేస్తారు. ఈ కళే జీవనభృతిగా పొట్టపోసుకుంటారు.

* * *

ఓ కార్పొరేట్ స్కూల్లో ఘనంగా స్వాతంత్ర్యోద్యమ వేడుకలు జరుగుతున్నాయి. ఆ ప్రాంగణం అంతా రంగుల కాగితపు తోరణాలతో, జాతీయ జెండాలతో అలంకృతమై ఉంది. టీచర్లు, పిల్లలు కూడా మంచి మంచి దుస్తులు ధరించి ఉన్నారు. అందరి వదనాలలో ఆనందం తొణికిసలాడుతున్నది జండా వందనం అనంతరం బాలల సాంస్కృతిక కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. డీజే సౌండ్ సిస్టంలో మంచి మంచి హిందీ దేశభక్తి పాటలు వస్తున్నాయి. ఆ పాటలకు అనుగుణంగా పిల్లలు నృత్యాలు చేస్తున్నారు. హే మేరీ ఇండియా... ఆజాది ఇండియా... అంటూ సాగే పాటలకు పెద్ద పెద్ద త్రివర్ణ పతాకాలు చేతబట్టి విన్యాసాలు చేస్తున్నారు. పెద్ద పెద్ద కోటలు, బురుజులు, పిరమిడ్లు వారికి వారే నిర్మిస్తూ వాటిపైకి ఎక్కుతూ జెండాను ప్రతిష్ఠిస్తున్నారు. కరతాళ ధ్వనులు మిన్నంటుతున్నాయి. వెనక నుండి రంగురంగుల పొగలు విరజిమ్ము తున్నాయి. ఆ బాల కళాకారులపై పూల వర్షం కురుస్తున్నది. ఆ చిన్నారుల గుండెలు ఎంతగానో ఉప్పొంగు తున్నాయి.

అనంతరం జరిగిన సమావేశంలో ఒక జర్నలిస్తు... బాలలపై కొన్ని ప్రశ్నలు సంధించారు (ఇంగ్లీషులో). మనకు స్వాతంత్రం ఎప్పుడు వచ్చింది? '1947 ఆగష్టు 15' అని అందరూ కచ్చితంగా చెప్పలేకపోయారు. ఎవరి నుండి స్వతంత్రం వచ్చింది అని అడిగితే సగం మంది బ్రిటీష్ వారి నుండి అని చెప్పారు. మిగిలిన సగం మంది మౌనంగా

ఉన్నారు. కొందరు అమెరికా నుండి అని కూడా అన్నారు. స్వాతంత్ర్యం రాకపోతే ఏమై ఉండేది అన్న ప్రశ్నకు చాలామంది ఏమీ చెప్పలేకపోయారు. ఒకరిద్దరు మాత్రమే బానిసత్వంలో ఉండేవాళ్ళం అని చెప్పగలిగారు.

ఈ రెండు ఘటనలను మనం పరిశీలించినట్లయితే కొందరికి చదువు ఇప్పటికీ అందని ఆకాశం లాగానే ఉండిపోయింది. మరికొందరికి అవకాశం ఉన్నవారు ప్రదర్శిస్తున్న కళను విద్యతో అనుసంధానం చేసుకోలేకపోతున్నారు. కారణం అక్కడ ఉపాధ్యాయులు విద్యావ్యవస్థ కావచ్చు.

## బృందంగా...

మరోచోట ఓ తరగతి గదిలో ఉపాధ్యాయుడు పిల్లలకు కథ చెప్పాడు. పొగరుబోతు రాజు సైన్యంతో పొరుగున ఉన్న ఓ మంచి రాజుపై దండెత్తడానికి వెళ్తున్నాడు. అదే సందర్భంలో ఆ మంచిరాజు తన సైన్యంతో ఎదురొచ్చాడు. పొగరుబోతురాజు అంటున్నాడు – "నీవు రాజువా? నీకు సైన్యమా! నీ నుండి ఓ సైనికుడు నా సైన్యంలో కలిస్తే నా సైన్యం రెట్టింపవుతుంది అన్నాడు. అప్పుడు మంచిరాజు "ఎందుకంత కోపం ప్రభు... మీ నుండి ఓ సైనికుడు మా సైన్యంలో చేరితే ఇరువురి సైన్యం చెరి సమానమవుతుంది అని అన్నాడు. ఈ కథ చెప్పి ఎవరికి సైన్యం ఎంత ఉందో చెప్పమని అడిగాడు. పిల్లలు ఆలోచించుకుని, తర్కించుకుని సమాధానం చెప్పారు. జవాబు 7 – 5 అని తేలుతుంది.

ఈ ఇతివృత్తాన్ని నాటకంగా ప్రదర్శించమంటే సమిష్టిగా తమ సృజనశీలతకు పదును పెడతారు. మాటలు వారే రాసుకుంటారు. పద్యాలు, పాటలు కావాలంటే పాడుకుంటారు. యుద్ధకళ విన్యాసాలతో పాటు అభినయాన్ని జత చేస్తారు.

అధ్యయనం అనేది శారీరక వ్యాయామమే కాదు. మానసిక వ్యాయామం కూడా వారికి అనుభవపూర్వకంగా అర్థమవుతుంది. పాఠాలు చెప్పడానికి తరగతి గదినే రంగస్థలంగా చేసుకోగలిగితే అద్భుతమైన ఫలితాలు వస్తాయి. కళను విద్యతో అనుసంధానించడం వల్ల బాలల సర్వతోముఖాభివృద్ధికి కళ తోడ్పడుతుంది.

* * *

# 3. విద్యాసమమ్ నాస్తిశరీరభూషణమ్

**– కట్టా కృష్ణారావు,** కాకినాడ, సెల్ : 9490186602

విద్య ... అంటే ఏమిటి?
చదువు ...
చదువంటే ఏమిటి?
మరదే వితండ వాదమంటే...
వితంటమా!?

కాక మరేంటి! మనిషిని చూపించి – మనిషంటే ఏమిటి? అని ప్రశ్నిస్తే ఏమనుకోవాలి?

దిమాఖ్ ఖరాబ్ అయ్యిందనుకోవాలి.
మస్తిష్కం మతి చెడిందనుకోవాలి.

మెంటల్ డిజార్డర్ వచ్చిందనుకోవాలి... అవునా? కాదా? విద్యంటే అర్థమై అర్థమయ్యేలా చెప్పలేకున్నామా? అసలు విద్యంటే ఏమిటో అర్థం చేసుకోలేకపోతున్నామా?

కన్‌ఫ్యూజన్... మెదళ్ళో కాస్త గంగరగోళం... అరె! చూస్తే చిన్న ప్రశ్నలాగే ఉంది.... చెప్పాలంటే దేవుడో... దెయ్యమో దిగిరావాల్సిందేనా?!

ఈ విద్య... చదువు చుట్టూ ఎన్నో సంక్లిష్టతలు... చర్చలు... ప్రసంగాలు... వాదాలు... వివాదాలు... విజ్ఞానాలు–అజ్ఞానాలు ప్రకటనలు... ప్రలోభాలు... పేపర్లలో పేజీలకు పేజీల అడ్వటైజ్‌మెంట్లు.. రేడియోలో... టివిల్లో పత్రికా మీడియాల్లో ఎనవున్స్‌మెంట్లు మాలాంటి సామాన్యులికి బుర్ర తిరిగిపోతుంది.

విద్యంటే వ్యాపారమా? డబ్బుపెట్టి కొనుక్కొనే అంగడి సరుకా? చదువంటే పోటీ... మాట వినకపోతే లాఠీ... పిల్లలకి చదువు మంత్రం వేస్తాం... విద్యా తంత్రం పూస్తాం... మార్కులు, ర్యాంక్‌లు తెప్పిస్తాం.

జాయిన్ చేసిన రోజునుండే ఐఐటి క్లాసులు... కంప్యూటర్‌తో పోటీలు... డాక్టర్లు... ఇంజనీర్లు కావడం ఖాయం.

కలల్లోకి జంప్ చేస్తే... అమెరికాలు... డాలర్లు... వర్షం వరద... ప్రవాహం... ఆ వెల్లువలో తల్లిదండ్రులు ఉక్కిరిబిక్కిరి తమ బిడ్డల భవిష్యత్ దర్శన భ్రమాజనిత విశ్వరూపం... ఆనందంతో ఆశ్చర్యంతో... ఊహాలోకాల్లో విహరించడం.

దానివల్ల శతసహస్రకోట్ల రూపాయలదే వ్యాపారం కళ్ళుమిరుమిట్లుగొల్పేలా విరాజిల్లుతుంది.

విద్యంటే ఇదా? చదువంటే ఇలానా? రూపాయిలు పెట్టుబడిగా పెడుతున్నాం... లాభాలకోసమేగా... పిల్లలపై పెట్టుబడి పెట్టండి... డాలర్ల రూపంలో లాభాలొస్తాయి అంటున్నారు – పిల్లల తల్లిదండ్రులకు ఆకర్షణవ్యామోహం... ఆశా... దురాశల ఉచ్చుకు బలి... అంటే...

చిన్న పిల్లలకి భాషమీద భాష... సబ్జక్ట్ మీద సబ్జక్ట్... బుక్ మీద బుక్... కొత్త కొత్త బేగ్‌ల న్యూలుక్కు, పిల్లలు మొయ్యలేనంత విద్యాబరువుతో వెన్నెముక పళక్... అబ్బా!

ఉదయం నుండి సాయంత్రం దాకా క్లాసురూముల్లో అరెస్టు... పైపైకి పోయే కొలది తెల్లవారకుండా లేచి... రాత్రి నిద్రపోయే వరకు స్టడీ అవర్ల జైలు... సంకెళ్ళతో నడుస్తున్న విద్యార్థి శవాలు – నిర్వేదంలో మగ్గింగ్ మిషన్లు... చైతన్యం కోల్పోయిన జీవచ్ఛవాలు.

ఏమిటి ఇదంతా? చదువే? విద్య నేర్పడమంటే ఇలాగే? ఇలాంటి ప్రశ్నలు తలెత్తడం... అర్థముందో? లేదో?

సమాధానం కూడా.. కాదు... అవును... ఏమో...

అసలు విద్యంటే... ఏమిటి? చదువంటే... ఏమిటి? తరగతిగదులా? ... పుస్తకాల?... కంఠతా పట్టడాలా. పరీక్షలు రాయడాలా? సర్టిఫికెట్లు సంపాదించడాలా?

ఇవేమి చేయని వాళ్ళు విద్యలేని వాళ్ళేనా? మానవ జీవనం సాగించడానికి విద్యలు అవసరమా? మరి కోటి విద్యలు కూటి కొరకే అన్నారుగా... సంపద సృష్టించడానికి సమస్త వృత్తులు అవసరమేగా.. ఆ శ్రమవల్లే మానవాళి అవసరాలు తీర్చే అన్ని వస్తు సంపదా సృజియింపబడుతుంది. ఆహారం రూపంలో నోట్లో కెళుతుంది. అందరికి జీవనాన్ని అందిస్తుంది – పొలం దున్నడంలో విత్తు నాటడంలో... ఆహారం పండించడంలో విద్య లేదా? దాహార్తిని తీర్చే నీరును పారించడంలో విద్యలేదా? నివాసముండటానికి కావాల్సిన ఇంటి నిర్మాణంలో విద్యలేదా? ప్రయాణ సాధనాల్లో విద్య లేదా? డాములు కట్టడంలో వాహనాలు నడపడంలో... రోడ్లు వెయ్యడంలో... ఎందులో చూసినా అంతా విద్యే. పుస్తక పఠనం చదువని, వృత్తి నైపుణ్య విద్యని అంటారు కొందరు... అక్షరజ్ఞానం లేనివాళ్ళు నిర్వహిస్తున్న ఎన్నో వృత్తుల్లో వాళ్ళ నైపుణ్యాన్ని తక్కువ అంచనా వేయగలమా? అదంతా విద్యేకదా?

విద్యంటే...

వివేకం... పరిశీలన... ఆలోచన... విశ్లేషణ,... అవగాహన... వ్యక్తీకరణ, భావన... అనుభూతి, అధ్యయనం... పంచేంద్రియజ్ఞానం... విచక్షణ... జ్ఞప్తి... ప్రజ్ఞా... ధారణ... ప్రయోగం... కృషి... నైపుణ్య సాధన... ఇలా.... ఎన్నో ఎన్నెన్నో...

Education means which can provoke thinking అన్నారు – అంటే ఆలోచన రేకెత్తించేది...

Education means the pursuit of truth అన్నారు.. అంటే సత్యాన్వేషణ ....

ఆదిమ మానవ దశనుండే పొందిన కష్టాలు, సంతోషాలు, అనేక అనుభవాల సారమే విద్య. కష్టం నుండి నష్టం నుండి దుఃఖం నుండి ఆనందాల నుండి పొందిన గుణపాఠాలే విద్య... అవసరం... ప్రతీదీ ఆసక్తితో పరిశీలించడం... పరిశోధించడం తరువాత తరాలకు అందించడం నేర్చినదే విద్య... ప్రాకృతిక రహస్యాలు చేదించి సత్యాల్ని తెలుసుకోవడానికి కృషి చేసి కష్టాల్ని అధిగమించడానికి చేసిన ప్రయత్నమే విద్య – వికాసం.

అలా... అలా లక్షల కోట్ల మానవులు తెలుసుకొన్న... అనుభవాలు, అవగాహనలు, గుణపాఠాలు, గ్రహించిన ప్రాకృతిక సత్యాలు గుదిగుచ్చితే పుస్తకాలుగా మారాయి. పాఠ్యాంశాలుగా మారాయి. అనేక సబ్జక్టులు రూపాంతరం చెందాయి. ఆశక్తితో తెలుసుకోవడం జ్ఞానంగా మారింది...

అందుకనే ఎందరో మేధావులు చెప్పుతున్నారు.... ఆలోచన లేని అధ్యయనం పరమ దండగ.... అలాగే అధ్యయనం లేని ఆలోచన కూడ శుద్ధ దండగని.

అంటే తరగతి గదిలో ఉపాధ్యాయుడు విద్యార్థులకు బోధించాల్సింది పుస్తకాలు... సబ్జక్ట్సు కాదు.. విద్యార్థుల్లో తెలుసుకోవాలనే జిజ్ఞాసను రేకెత్తించాలి... అధ్యయనం చేయాలనే స్ఫూర్తిని కలిగించాలి. ఆలోచనా చైతన్యాన్ని మేల్కొల్పాలి... ఉత్తేజాన్నిచ్చే విషయ వివరణలతో విద్యార్థిలో నిద్రాణమై ఉన్న జ్ఞానతృష్టను నిద్రలేపాలి.

గొప్ప విద్యావేత్త బెట్రాండ్ రసల్ అభిప్రాయంలో

Education is a process of Self development, but this self development is possible only in and through society. Education is not an end in itself, but it is a means to an end. It must include human element in simple manner.

అందుచేత టీచింగ్ అంటే కోచింగు కాదు.

పాఠాలంటే పరీక్షలు కాదు, విద్యార్థులంటే రోబోలు కాదు అని గుర్తించాలంటే... ఆటంటే క్రికెట్టేనని... పరీక్షలంటే ఎంసెటేనని... భాషంటే ఇంగ్లీషేనని... ఉద్యోగమంటే కంప్యూటర్లని... సంపాదనంటే అమెరికాననే భ్రమలు తొలగిపోవాలి. దీనికోసం ఫిన్‌లాండ్ దేశంలో విద్య ఎలా ఉందో చూద్దాం!

ఫిన్‌లాండ్ దేశంలో 7 సంవత్సరాలు పిల్లలకి వచ్చే వరకు స్కూల్లో చేర్చుకోరు. పుస్తకాల బరువుల్లేవు. సిలబస్‌పై సిలబస్ లేదు... దేశమంతా ఒకటే విద్య.... అంతా ఉచితం. ప్రైమ్ మినిస్టర్ కొడుకైనా ఆ స్కూల్లోనే చదవాలి. వారు చదువంటే "విద్యార్థుల్ని ఈ ప్రపంచంలో జీవించడానికి సిద్ధం చేయటం" అంటున్నారు. "ఈ ప్రపంచాన్ని మరింత అర్థవంతంగా, సుందరంగా పిల్లలే తీర్చిదిద్దేలా నేర్పడం" అని అంటున్నారు.

"క్రియేటివ్ పెడగోగీ, న్యూ ఎడ్యుకేషన్ స్ట్రాటజీస్" అన్న అంశం మీద జూన్ 6, 7 తేదీల్లో 2017లో హైద్రాబాద్ బిర్లా సైన్స్ సెంటర్లో జరిగిన వర్క్‌షాప్‌లో ఫిన్‌లేండ్ హెడ్ ఆఫ్ స్ట్రాటజిస్టు "హెరాంబ్" తోబాటు నార్వేకు చెందిన డా॥ గోడిషెల్లర్ పాల్గొని వాళ్ళ విద్యావిధానం వివరించారు. వాళ్ళ దేశంలో స్కూల్ టీచర్‌గా చేరాలంటే మినిమమ్ మాస్టర్ డిగ్రీ ఉండాలి... సెకండ్రీ స్కూల్ టీచర్‌కి పిహెచ్‌డి తప్పనిసరి. ఉపాధ్యాయ ఉద్యోగ పరీక్షలో యూనివర్సిటీ టాపర్లే వస్తారు. సెలక్ట్ అయితే ఒక సంవత్సరం ట్రైనింగ్. దేశంలో అందరికంటే హెచ్చు జీతం. వారు ప్రపంచానికి కావల్సిన భవిష్యత్ తరాల్ని తయారు చేయాలి. మిడిమిడి జ్ఞానంతో కాక సంపూర్ణ జ్ఞానం బోధిస్తారు.

అంతర్జాతీయంగా విద్యార్థుల సామర్థ్యాన్ని పరీక్షించే "ప్రోగ్రామ్‌ఫర్ ఇంటర్నేషనల్ స్టూడెంట్ ఎసెస్‌మెంట్" (పిసా) పరీక్షలో ఫిన్‌లాండ్ విద్యార్థులే ఎప్పుడూ ఫస్ట్. దాని తరువాతే మిగిలిన దేశాలు అమెరికా, జపాన్, చైనా లాంటివి. ఆ పోటీలో భారతదేశం నుండి ఒకసారి పాల్గొన్నారు. మనకు క్రింది నుండి రెండవ రేంక్ వచ్చింది. నిజం గుర్తించిన మన కార్పొరేట్ విద్యాసంస్థలు వారు మళ్ళీ భారతీయ విద్యార్థుల్ని ఆ పోటీకి పంపలేదు. మరి మన దేశంలో ఎడ్యుకేషన్ స్టాండర్ట్స్ గురించి ఆలోచించాలి. అంటే సరైన విద్యకోసం సరైన అవగాహన కోసమే... కదా! చర్చించాలి.

* * *

***"మనం మన పిల్లల్ని కూలివాళ్ళను చేసి సంతృప్తి పడతాం. సంపాదనాపరుల్ని చేసి సంతోషిస్తాం. మనం మన పిల్లల్ని దొంగల్నీ, బాల నేరస్తుల్నీ చేసి ఏమి తెలియనట్లు నటిస్తాం. పసిపిల్లల చేత మనం కాళ్ళు పట్టించుకుని, ఇల్లు తుడిపించుకుని, ఎంగిలి గిన్నెలు కడిగించుకుని, సారా గ్లాసులు తెప్పించుకుని, రిక్షా తొక్కించుకుని, రాళ్ళు మోయించుకుని కూడా మనం నిస్సిగ్గుగా, నిర్భూచీగా పాపభీతి కూడా లేకుండా బతికేయగలం."***

# 4. చదువంటే ఏమిటి ? అసలు చదువెందుకు ?

**– డా॥ పి. యస్. ప్రకాశరావు,** పెదపూడి, సెల్ : 9963743021

**చదువంటే ఏమిటి ?:**

చదువు అంటే నేర్చుకోవడం, అభ్యసించడం అని అర్థం. Learning అన్నాడు సి.పి.బ్రౌన్. 'విద్య' దీనికి పర్యాయ పదం. అంటే ఏది నేర్చుకున్నా అది విద్యే అవుతుంది. మానవ జీవనానికి అవసరమైన బట్టలునేయడం, కుండల తయారీ, చెక్కతో గృహోపకరణాల తయారీ వంటి వృత్తి ఏది నేర్చుకున్నా అది విద్యే. కానీ జన వ్యవహారంలో చదవడం రాయడం నేర్చుకోవడమే విద్య లేదా చదువు అనీ, బట్టలు నేయడం వంటివి వృత్తులనీ అభిప్రాయం స్థిరపడిపోయింది. ఇక్కడ మనం జనబాహుళ్యంలో ఉన్న అక్షర జ్ఞానానికి సంబంధించిన విద్య (చదువు) గురించే చెప్పుకుందాం.

**చదువెందుకు ?:**

మనిషి బ్రతకడానికి చదువు అవసరమా? అవును, అవసరమే. తనముందు తరాలవారు సాగించిన జీవన విధానాన్ని, అనుభవాలనూ తెలుసుకుని తాను మరింత మెరుగైన, సుఖవంతమైన జీవితం గడపడానికి చదవడం నేర్చుకోవాలి. తిరిగి తాను పొందిన జ్ఞానాన్ని తన ముందు తరాలవారికోసం నిక్షిప్తం చేయడం కోసం రాయడం నేర్చుకోవాలి. ఆలోచనాశక్తి కలిగిన జీవిగా మానవత్వం, దయ, ప్రేమ, అభిమానం బాల్యంలోనే అలవడటానికి చదువు నేర్చుకోవాలి.

కానీ పాలకుల స్వభావాన్నిబట్టి, సామాజిక పరిస్థితులనుబట్టి కాలక్రమేణా చదువుకి అర్థం, ప్రయోజనం మారిపోయాయి.అక్షరాభ్యాసానికి అనువైన వయసు, చదువులో భాగాలైన అక్షర జ్ఞానాన్నిపొందే క్రమం, చదవాల్సిన అంశాలు, వాటిని నేర్పే విధానం, అవి నేర్చుకునే పద్ధతి, నేర్పే గురువులూ అభ్యసించిన విషయాలను పరీక్షించే ప్రమాణాలు సర్వకాలల్లోనూ ఒకేవిధంగా లేవు.

చాతుర్వర్ణ వ్యవస్థ సమర్ధకులు కొన్ని వర్ణాలకు చదువుకునే అవకాశం లేకుండా చేశారు. చదువుకీ జన్మకీ ముడిపెట్టారు. కానీ మానవ పరిణామ క్రమాన్ని చూస్తే మర్కటం నుంచి మానవుడు పరిణామం చెందడంలో శ్రమ పాత్ర ఉన్నట్టే అభ్యాసంలో కూడా శ్రమ పాత్ర ఉంది. చదవడం, రాయడం అనేవి శ్రమ ద్వారా మానవుడికి సంక్రమించాయి.

“తన జీవనపోరాటంలో తన అవసరాలు తీర్చుకోడానికి మనిషి తన ముందు కాళ్లతో చేసిన పనులవల్ల ఆ చేతులను నియంత్రించే మెదడు భాగాలు అభివృద్ధి చెందాయి. అలాగే ఆ పనిని మరింత మెరుగుగా చేయడానికి అవసరమైన విధంగా ఇంద్రియాలు కూడా అభివృద్ధి చెందక తప్పని పరిస్థితి ఏర్పడింది. ఆ మేరకు ఇంద్రియాలతో అనుసంధానమైన మెదడు కేంద్రాలు అభివృద్ధి చెందాయి. ఇలా అభివృద్ధి చెందిన మెదడు చేతులచేత ఇంద్రియాలచేత మరింత మెరుగ్గా పని చేయించగలిగింది.” (పే. 102, మార్క్సిస్టు జ్ఞాన సిద్ధాంతం, రావు కృష్ణారావు) స్పష్టమైన శబ్దాలను వరసగా ఉచ్చరించడానికి నోటి అవయవాలు, విన్నదాన్ని గ్రహించడానికి శ్రవణేంద్రియాలు, పరిణామం చెందాయి. ఈ పరస్పర అభివృద్ధి అంతా అభ్యాసానికి తొలిమెట్లు. ఇవన్నీ పుట్టుకతోనే మానవుడికి సహజంగానే సంక్రమించాయి. కాబట్టి చదువుకీ పుట్టుకకీ సంబంధం లేదు.

రాచరికపు రోజులలో విద్యార్థులు చదువును ఆశ్రమాలలో గురుశుశ్రూష చేసి నేర్చుకునేవారు. చక్రవర్తి కొడుకైనా సరే చదువుకోవాలంటే గురువు దగ్గరకి వెళ్ళి తీరాల్సిందే. ఆ చదువంతా మౌఖికంగానే జరిగేది. గురువు చెప్పిన పాఠాలను శిష్యులు నిరంతరం వల్లెవేసేవారు. బట్టీ పట్టేవారు. పురాణేతిహాసాలూ, సంస్కృత పంచకావ్యాలూ వారికి పాఠ్యాంశాలు. ఆ కాలంలో పుస్తకాలు లేవు. గురువుదగ్గరుండే తాళపత్ర గ్రంథాలే ఆధారం. ఎవరెన్ని తాటాకు పుస్తకాలు చదివితే అంత గొప్ప. అతను ‘నీకంటే రెండాకులు ఎక్కువ చదివాడు’ అనే పలుకుబడి ఈనాటికీ భాషలో నిలిచి ఉండటమే దానికి నిదర్శనం. చాతుర్వర్ణ వ్యవస్థపై నడిచే సమాజం కావడం వల్ల అది కొన్ని కులాలవారికే పరిమితమై ఉండేది.

ఫ్యూడల్ వ్యవస్థలోగురువు దగ్గర నాలుగుగోడల మధ్య పుస్తకాలతో నేర్చుకున్నదే చదువు అనే అర్థం స్థిరపడిపోయింది. వర్ణ వివక్ష పూర్తిగా పోలేదు. బడులలో విద్యనేర్పడం మొదలయ్యాక బాలలకు ఐదో ఏట తండ్రి చేతనో బడిపంతులచేతనో బియ్యంలో బంగారపు టుంగరంతో “ఓం నమశ్శివాయ సిద్ధం నమః “(శివునికి నమస్కారము, సిద్ధునికి నమస్కారము) అని పలకమీద రాయించి పిల్లవాడిచేత పలికించేవారు. ఈ వాక్యంలోని ఓ, న, మ అనే మూడక్షరాలకే ఓనమాలు అని పేరు. అక్షర జ్ఞానం లేనివారు అనే అర్థంలో  అతనికి ఓ న మ లు రావు అనే పలుకుబడి వాడుకలోకి వచ్చి ఇప్పటికీ భాషలో నిలిచి ఉంది. ఈ కాలంలోనే చదవడంతోబాటు రాయడం కూడా విద్యాభ్యాసంలో భాగమైంది. తాళపత్ర గ్రంథాలే ఎక్కువగా వాడుకలో ఉన్న కాలంలో చదవడానికి ఇచ్చినంత ప్రాధాన్యం రాయడానికిచ్చే వారు కాదు. ఒకవేళ రాయాల్సివచ్చినా తాటాకులమీదే

రాసేవారు. "తాతగారికి తాటాకుల వ్రాతేగానీ కాగితం మీద కలం ఆట్టే నడిచేది కాదు" అన్నారు దువ్వూరి వేంకటరమణ శాస్త్రి. (స్వీయ చరిత్ర . పే. 45). చదవడం అలవాటయ్యాక రామాయణ మహా భారతాలూ సంస్కృత పంచకావ్యాలూ ఛందోవ్యాకరణాలూ వారి విద్యలో భాగంగా ఉండేవి. ఒక పిల్లాడికి చదువొచ్చిందో లేదో తెలియాలంటే ఒక శ్లోకానికో పద్యానికో భావం చెప్పమనేవారు. కరటకశాస్త్రి గిరీశాన్ని మహాభారతంలోని "నల దమయంతులిద్దరు.." పద్యం అడిగి భావం చెప్పమంటాడు.

పూర్వం చదువు అంటే పురాణాలూ కావ్యాలూ ఛందోవ్యాకరణాది గ్రంధాలు చదువుకుని ఉండాలి. తెలుగుతో పాటు సంస్కృతం కూడా చదువుకుని కావ్యపఠనం, పద్యాలు చెప్పగల నైపుణ్యం ఉంటే పాలకుల కొలువుల్లో ఉపాధి లభిస్తుందనే భావం ఉండేది. వలస పాలనలో ఈ అభిప్రాయం మారింది. ఇంగ్లిష్ భాష వచ్చినవారికే కుంపిణీ కొలువుల్లో దుబాసీలుగానూ, వ్రాయసగాళ్ళ గానూ ఉపాధి దొరికేది."తెల్లవాళ్ళ స్కూళ్ళలో తెలుగు పద్యాలమీద ఖాతరీ లేదండీ. ఎంతసేపూ జాగ్రఫీ, గీగ్రఫీ, అర్ధమేటిక్ ఆల్జీబ్రా, మేధమేటిక్స్– ఇవన్నీ హడలేసి చెప్తారండి" అంటాడు గిరీశం.

## చదువుకీ జ్ఞానికీ సంబంధం:

జ్ఞానానికీ చదువుకీ సంబంధం లేదు. ప్రకృతి నియమాలనూ ఋతువుల రాకపోకలనూ గ్రహించి పంటలు పండించే రైతు జ్ఞానం పుస్తకాలవల్ల వచ్చింది కాదు. ఢాకా మస్లిన్ నేతగాళ్ల నైపుణ్యానికి చదువుకీ ఏం సంబంధం ఉంది? లోకజ్ఞానం లేకపోతే పుస్తకజ్ఞానం వ్యర్ధం అని ప్రజలు గ్రహించారు. కాబట్టే చదివినోడికన్నా చాకలాడు మేలు అనే సామెత పుట్టింది. అలా అని పుస్తకాల ప్రాధాన్యం తక్కువేమీ కాదు. పుస్తకాలంటే ముందు తరాలవారి అనుభవ సారం. కాబట్టి చదువనే దానికి పుస్తక జ్ఞానంతోబాటు లోకజ్ఞానం కూడా అవసరం.

## నేటి విద్యా విధానం :

విద్యారంగంలోకి పెట్టుబడి ప్రవేశించాక కాన్వెంట్ చదువులు వచ్చాయి. ఒకప్పుడు ప్రజలు భక్తితో ఆదరించిన వుపాధ్యాయ వృత్తి గౌరవాన్ని కోల్పోయింది. లాభ నష్టాలే ప్రధానం అనుకునే పెట్టుబడి గురువులను తన గులాములుగా చేసుకుంది. పిల్లలు బడిలో చేరడానికి వయోపరిమితి తగ్గింది. బాల్యం బడిలో బందీ అయిపోయింది. సహజమైన వాతావరణంలో ఆహ్లాదకరంగా బోధించడానికి బదులు రేంకుల కోసం, ఇరుకు గదుల్లో, బోధించడం మొదలైంది. నేర్పడంలో శాస్త్రీయత కొరవడటం వల్ల బడి అంటే స్వేచ్ఛను హరించే ఒక బందిఖానా అనే భావం పిల్లల్లో కలిగింది." చాలామందికి

పిల్లల్ని చదువంటే బెదరగొట్టటం చాతనయినంతబాగా వాళ్లకి చదువుమీద ఇష్టం కలిగించడం చాతకాదు.పిల్లలు చేసే అల్లరితో వేగలేక అనేకమంది తల్లులు 'వెధవా, బళ్ళోవేస్తేగానీ నీ పొగరణగదు "('చదువు' నవలలో కొ.కు) అని పిల్లల్ని భయపెట్టేవారు. సమాజంలో శ్రమపట్ల చిన్నచూపు ఏర్పడింది. తమ పిల్లలు డాక్టర్లో ఇంజనీర్లో అయిపోయి అమెరికా వెళ్ళి పోవాలని తల్లిదండ్రుల ఆలోచన. ఈ గందరగోళంలో మధ్యతరగతి బలైపోయింది.

ఇప్పుడు చదువుతో బాటు సాహిత్యం కళలూ కూడా పెట్టుబడి గుప్పిట్లోకి వచ్చి దానిముందు మోకరిల్లుతున్నాయి. ప్రస్తుతం చదువు అంటే కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలను కాపాడే భావజాలం. విద్యావంతులు అంటేభారీ పరిశ్రమలలో సరుకుల తయారీకీ, వాటి ప్రచారానికీ ఉపయోగపడే సాంకేతిక విజ్ఞానం సంపాదించిన కొద్దిశాతం యువకులు. సాహిత్యం, కళలూ, ప్రసార, ప్రచార సాధనాలూ, కార్పొరేట్ భావజాల ప్రచారానికి వాహికలుగా ఉంటాయి. దోపిడీ వర్గమే పాలకవర్గంగా ఉంటుంది కాబట్టి ఆ వర్గ భావాలే ప్రజల భావాలుగా చలామణీ అవుతూ ఉంటాయి. విద్యాసంస్థలలో ఆ భావజాలాన్నే బోధిస్తూ ఉంటారు. ఎప్పుడూ జాతీయత, దేశభక్తి, చరిత్ర, సంస్కృతి పేర్లతో బడుల్లో పాఠ్యాంశాలుగా బోధించేవన్నీ దోపిడీ వర్గానికి ఉపయోగపడేవే. "న్యాయ శాస్త్రం, నీతీ, మతం అనేవి బూర్జువాల నమ్మకాలే" (కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక).

**చదువు ఎలా ఉండాలి? :**

పిల్లలకు భారం కాకూడదు. వాళ్ళ బాల్యాన్ని చిదిమేసేదిగా ఉండకూడదు. జీవితంలో ఉపయోగపడాలి. వాళ్ళు చదువుకునే సైన్స్ నిత్య జీవితంలో ఎదురయ్యే విశ్వాసాలనూ, మూఢనమ్మకాలనూ శాస్త్రీయ దృక్పథంతో విశ్లేషించగలగాలి. సమాజ గమనానికి మూలం శ్రమ అనే భావం తెలిపి శ్రమ పట్ల గౌరవభావం కలిగించాలి. చదువంటే అదే.

* * *

# 5. చదువు : ఒక విశ్లేషణ

– **వేణుగోపాల్ వర్మ,** మెహబూబ్ నగర్, సెల్ : 9908825459

చదువు అంటే సమాచారమేనా?

చదువంటే ఉద్యోగాన్ని సంపాదించిపెట్టే అర్హతేనా?

చదువంటే మార్కులు, ర్యాంకులు, గ్రేడుల గోలేనా?

చదువంటే డాలర్లవేటకి, విదేశాలకి పరుగులేనా? ఇంకేమీ కాదా?

ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు, పిల్లలకి విద్యను దాని వాస్తవిక అవగాహనతోనే అందిస్తున్నారా? అంటే సందేహమే సమాధానం అవుతుంది. చదువు యొక్క ప్రయోజనాన్ని, లక్ష్యాన్ని చర్చించే ప్రయత్నాలు బహు అరుదుగా జరుగుతాయి. పాలక వర్గాలకి కావలసింది కూడా అదే. ఏవో కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలు చదువుపట్ల ఏర్పరుచుకుని వాటిని కొనసాగేలా చేయడమే అందరి కర్తవ్యం అయ్యి కూర్చుంది. ఇలాంటి తరుణంలో మరోసారి దేన్ని విద్య అంటారు. అసలు మనిషి ఎందుకు విద్యావంతుడు అవ్వాలి అనే కోణంలో ఒక చిరు ప్రయత్నంగా ఈ చర్చ చేస్తున్నాను.

చదువు లేక విద్య యొక్క లక్ష్యం జ్ఞానార్జన చేయడం అంటుంటారు. అంటే మానవ పరిణామ దశలన్నింటిలో తను పొందిన అనుభవాలు, జ్ఞానాన్ని, పరిశోధనల సారాన్ని, రికార్డు చేసిన విజయాల్ని, సాధించిన నైపుణ్యాల్ని, అభివృద్ధి చేసిన శాస్త్ర పరిజ్ఞానానికి సంబంధించిన జ్ఞానాన్ని ఆర్జించడంగా అర్థం చేసుకోవచ్చు. కొత్త తరాలు ఈ పూర్వ జ్ఞానం ఆధారంగా కొత్త జ్ఞానాన్ని అభివృద్ధి చేయగలరన్న నమ్మకం ఇందులో ఉంటుంది. అయితే జ్ఞానం ద్వారా చదువు మొత్తం లక్ష్యం నెరవేరదు.

కొందరు విద్యయొక్క ప్రయోజనం దాని సృజనాత్మక అభివ్యక్తి ద్వారా ప్రకటించ బడుతుంది అని అభిప్రాయ పడతారు. కళలు, సాహిత్యం, సైన్స్ రంగాలు అలాంటి అభివ్యక్తికి ఆలవాలంగా ఉంటాయి. అయితే ఈ సృజనాత్మక ఉత్పత్తులు కూడా నేడు విపరీతమైన పోటీని ఎదుర్కొంటున్నాయి. నిన్నటి మెరుగైన ఆవిష్కరణ నేటికి ఉనికి కాపాడుకోవడానికి కష్టపడుతుంది. సృజనకారుడు సంతృప్తిని, డబ్బుని ఏక కాలంలో పొందలేని స్థితి వచ్చింది. ఆవిష్కరణలు మానవ జీవితాల్ని సుసంపన్నం చేస్తూ దాని భౌతిక అవసరాలు తీర్చడం మేరకు మాత్రమే ఉపయోగపడుతూ మనిషిని అతని మౌలిక రూపం అయిన మానవత్వాన్ని మరుగున పడేస్తున్నాయి. వినిమయదారి సంస్కృతిలో

అయితే మనిషి మృగ్యం అవుతున్నాడు లేదా మృగంలా మారుతున్నాడు. ఈ పాపం కూడా చదువుదే.

పోనీ చదువుకు దాని సహజ అర్థం అయిన 'వికాసం' అయినా మిగిలి ఉందా అంటే ప్రస్తుతం ఆ వికాసం కూడా చాలా సంకుచితంగా మారిపోయింది. మనిషి తను విద్యావంతుడై పెంపొందించుకోవాల్సిన విశాల దృక్పథాన్ని బౌద్ధిక, మానసిక, నైతిక, వికాసాలన్నీ పూర్తిగా వ్యక్తిగతమైన స్వార్ధంతో సతమతమౌతున్నాయి. ఎలాగైనా ఎదగాలి,, ఎలాగైనా గెలవాలి. ఎలాగైనా డబ్బు సంపాదించాలి. అనే యావకి కట్టుబడిన వికాసం అనే విద్యాలక్ష్యం సమిష్టి తత్వాన్నికోల్పోయి కుంటుపడింది. కుప్పలు తెప్పలుగా పుట్టుకొచ్చిన వ్యక్తిత్వ వికాస నిపుణుల, వారి సాహిత్యానికి కూడా ఈ పాపంలో భాగం ఉందని చెప్పక తప్పడం లేదు.

మన చుట్టూ ఉన్న సమాజంలో ఎంతోమంది విద్యాధికులు, విషయ పరిజ్ఞానం ఉన్నవారు, పాండిత్యం ఉన్నవారు, శాస్త్రవేత్తలు తారసపడతారు. వారు నిత్యం ఉపన్యాసాలు, రచనా వ్యాసాంగాలు, చేస్తున్న వారై కూడా ఉండవచ్చు. అయినా సమాజంలో వారి జ్ఞాన భాగస్వామ్యం సమాజంపైన వారి భావాల ప్రభావం చాలా అత్యల్పంగా కనపడుతుంది. జీవిత రంగాల్ని ప్రభావితం చేసి ప్రక్షాళించలేని వీరి పరిజ్ఞానం, అందుకు కారణం కాగా, అక్షరాస్యత స్థాయిని దాటని వీరి అధ్యయనం, ఆచరణలేమిలోకి నెట్టబడుతుంది. ఆచరణాత్మకం కాని చదువు ఎలాంటి సామాజిక రుగ్మతలని పరిష్కరించలేదు. అందుకే "విద్య యొక్క అంతిమ లక్ష్యం జ్ఞానార్జన కాకూడదు ఆచరణ కావాలి." మరో కోణంలో చూస్తే – 'బలవంతుడే బ్రతకాలనే అడవి నీతి అమలు అవుతున్న సమాజం మనది. ఆ కుటిల నీతికి బలై తరతరాలుగా నిరంతరం దోపిడీకి గురవుతూ వస్తున్న పీడిత ప్రజలు ఉన్నారు. సమాజ నిర్మాణంలో తమ శ్రమశక్తిని పూర్తిగా వినియోగించి కూడా, వనరులు, సంపదలలో తగిన ప్రతిఫలానికి వంచితులైన వీరికి జరుగుతున్న అన్యాయాన్ని ప్రశ్నించి, లెక్క తేల్చాల్సిన అవసరం చదువుకి లేదా? అందుకే మహాత్మా జ్యోతిబాపూలే విద్య యొక్క ప్రయోజనాన్ని ఇలా నిర్వచిస్తాడు.

"చదువుకోవడం అంటే – నీ శత్రువు ఎవరో తెలుసుకోవడం"

ప్రస్తుత చదువుల తీరు పూర్తిగా భిన్నంగా ఉంది. విద్యాలయాలలో బట్టీ చదువుల ప్రహసనం కొనసాగుతుంది. కార్పొరేట్ భట్టిలలో పనిచేయడానికి కావాల్సిన కార్మికులను,

గుమస్తాలను తయారుచేసే వెట్టి చదువులు ఇవి. ముందే నిర్దేశించిన ప్రశ్నలకు, నిర్దుష్ట సమాధానాలు రాయడం ఒకటే లక్ష్యంగా పరీక్షల వ్యవస్థ ఉంది. నిజానికి "చదువంటే పాత ప్రశ్నలకు జవాబులు వెతకడం కాదు మరిన్ని కొత్త ప్రశ్నలను సంధించడం అవ్వాలి,'

చదువంటే నిర్మాణాత్మక వైఖరిని కలిగించడం, పరిశీలనాతత్వాన్ని పెంపొందించడం, శ్రమను ప్రేమించడం, గౌరవించడం, గుర్తించడంగా అభిప్రాయపడుతూ గీజుబాయి బగేకా గారు వ్యాఖ్యానించారు.

సమాజపు నీతి నియమాలను దేశకాల పరిస్థితులకు అనుగుణంగా పునర్నిర్మించుకునే పరిణితి, ప్రపంచపు స్వరూప స్వభావాల్ని, జీవితపు ఎత్తు పల్లాలను దర్శించగలిగే నేర్పు, ఓర్పు చదువు ద్వారానే సాధ్యపడతాయి. విషయాల పట్ల, విధానాల పట్ల విశ్లేషణాత్మక అవగాహన, విమర్శనాత్మక దృష్టి కలిగి ఉండడం విద్యావంతుడి మొదట అర్హతగా ఉండడం ఎంతైనా అవసరం.

చదువుకు ఉండాల్సిన మరో ప్రధానమైన మరియు అత్యున్నతమైన లక్షణం, లక్ష్యం, ప్రయోజనం దాని మానవీయ, సామాజిక కోణమే. చదువు తన తోటివారితో కలిసి జీవించడానికి కావాల్సిన శిక్షణ ఇచ్చేదిగా ఉండాలి. ఒక్కరి కోసం అందరూ – అందరికోసం ఒక్కరు అనే సామాజిక సూత్రాన్ని బోధించని చదువు చదువే కాదు. విద్యనభ్యసించే ప్రతివ్యక్తి సమాజాన్ని నవ్య నాగరికతవైపు నడిపించే చోదక శక్తి కావాలి. చదువు యొక్క ప్రాథమిక మరియు అంతిమ ప్రాధాన్యం మనిషే కావాలి. అందునా అట్టడుగున ఉన్న మనిషి ప్రయోజనానికి అంకితమవ్వాలి. అమానవీయ ఆచారాల్ని, తిరోగమన, అశాస్త్రీయ భావాలని, చీల్చి చెండాడి, మనిషి గౌరవాన్ని, పర్యావరణ హితాన్ని కాంక్షించే చదువు నేడు కావాలి. స్వేచ్ఛకి ఆనందానికి సమానత్వానికి, శాంతికి పర్యాయపదం లాంటి విద్యే నేటి తక్షణ అవసరం. అలాంటి చదువునే నేను కాంక్షిస్తాను. విశ్వసిస్తాను.

* * *

# 6. సమగ్ర వికాసమే విద్యా లక్ష్యం

– **ఎస్.ఆర్. పరిమి,** విజయవాడ, సెల్ : 9490635346

ప్రేమ పూరితమైన వాతావరణంలో ఆడుతూ పాడుతూ బాల్యాన్ని గడపటం ప్రతి పిల్లవాడి జన్మహక్కు. పిల్లలుగా వాళ్ళ హక్కుని అడిగి సాధించుకునే పరిస్థితి లేదు. రాదు కూడా. ఆ బాధ్యత సభ్య సమాజం తీసుకోవలసిందే. ఆడుతూ పాడుతూ గడపాల్సిన బాల్యానికి చదువులు పెద్ద గండంగా పరిణమించాయి. ఆ గండం రానురానూ యింతింతై వటుడింతై అన్న తీరున, పిల్లల బాల్యానందాలను హరించడమే కాకుండా, వారి బ్రతుకుల్ని నిస్సారంగా, బరువుగా తయారుచేసాయి.

పిల్లల్ని బాగా పట్టించుకుంటున్నాం అనుకునే తల్లిదండ్రులలో కూడా ఆడుతూ పాడుతూ చదువుకోవడం మీద మంచి అభిప్రాయం లేదు. పరీక్షలలోమార్కులు సాధించడమే చదువుల లక్ష్యంగా భావించడం వలన, మార్కులు, గ్రేడుల పరుగు పందెంలో వెనుకబడిపోతారేమోన్న భయంతో, అతిచిన్న వయస్సు నుండి పిల్లల ప్రపంచాన్ని పుస్తకాలతో, పరీక్షలతో నింపేశారు. పై తరగతుల పాఠ్యాంశాలను క్రిందికి, మరింత క్రిందికి సరఫరా చేసి పుస్తకాల బరువుకు మించిన పాఠాల బరువుతో వాళ్లకు బాల్యాన్ని లేకుండా చేశాం. పిన్న వయస్సులో పుస్తకాల నుండి కాకుండా పరిసరాల నుండి అనుభవపూర్వకంగా నేర్చుకున్నదే చాలా ఎక్కువ, అందుకు సమయం యిచ్చినట్లయితే అది విలువైన జ్ఞానం కూడా. ఇందుకు తోడు ఆంగ్ల మాధ్యమం మోజుతో, పిల్లలకు తెలిసిన విషయాలను కూడా అర్థంకాని పరాయి భాషలో చెప్పి, బట్టీ విధానాన్ని ప్రోత్సహిస్తూ పిల్లల్ని మరింత కృంగతీస్తున్నారు. శాస్త్రీయంగా నిర్ధారించి ప్రపంచ వ్యాప్తంగా ప్రాథమిక స్థాయిలో మాతృభాషలోనే విద్యాబోధన జరుగుతున్న నేపథ్యంలో, మన చిన్నారులు ఇంగ్లీషు మీడియం మాయచదువులకు బలి కావడం శోచనీయం. ఇంగ్లీషును భాషగా నేర్చుకోడానికి, మాధ్యమంగా పసిపిల్లలపై రుద్దటానికి తేడాని గుర్తించలేకపోవడం ఒక పట్టాన అర్థం కాని విషయం. వీటన్నిటికి తోడుగా చదువుల పేరున వేళకు కడుపునిండా తిండి, ప్రతి రోజూ వళ్ళలిసేలా వ్యాయామం పిల్లలకు లేకుండా చేశాం. ఇవన్నీ మూకుమ్మడిగా చేరి, పిల్లలలో సహజమైన ఎదుగుదల లేకుండాపోయి, వాళ్ళను జీవితాన్ని సమర్థించుకోలేని అవిటివాళ్ళుగా చేస్తున్నాయి. కొంచెం నింపాదిగా చూస్తే, యిందులో అర్థంకాని విషయం లేదు. విద్యావేత్తలు, కొఠారీ కమిషన్, యష్‌పాల్‌కమిటీ, నేషనల్ కరికులం ఫ్రేమ్‌వర్క్ – ఒకరని కాదు, అందరూ ఘోషపెడుతున్నదిదే. పిల్లలు ప్రయోజనపరులు కావాలన్నా, వాళ్ళ భవిష్యత్తు దానితో ముడిపడి వున్న జాతి భవిష్యత్తు ఆశాజనకంగా వుండాలన్నా – ప్రాథమిక విద్యాలక్ష్యం పిల్లల సమగ్ర వికాసమే అవ్వాలి.

ఆస్కార్ వైల్డ్ అంటారు – "పిల్లలకు మంచి నడతను నేర్పే అత్యుత్తమ మార్గం వాళ్ళను సంతోషంగా వుంచడమే" నని.

సమాజంలో వున్న రుగ్మతలన్నిటిని పోగొట్టగలుగుతుంది నిజమైన విద్య. శారీరకంగానూ మానసికంగానూ ఆరోగ్యంగా వుండటం కన్నా పెద్ద వరం మరొకటుండ బోదు ఏ మనిషికైనా. సంతోషంగా బాల్యాన్ని గడిపిన వాళ్ళకే యిది సాధ్యం. పిల్లలను పట్టించుకునే ప్రతి ఒక్కరూ, వాళ్ళతో గడిపే ప్రతిక్షణం గుర్తుంచుకోవలసిన ఒకే ఒక అంశం – పిల్లలను సంతోషంగా వుంచడం ఎలా? దానికోసం ఎంత ఎక్కువ శ్రమించినా తక్కువే. అదేం అంత సులభం కాదు. గీజూభాయి మాటల్లో – చెమటలు పట్టించుకో వలసిందే.

తనను తాను సమర్థించుకోగల నైపుణ్యాలు అలవర్చుకోవడం ప్రతి ప్రాణికి ప్రకృతిలో ఏర్పాటయింది. ఆ ఏర్పాటుకు అంతరాలను కల్పిస్తే ఆ ప్రాణి సహజమైన వికాసానికి నోచుకోదు. ప్రకృతిలో ఏర్పాటైన స్వచ్ఛమైన గాలి, వెలుతురు, కండరాల అభివృద్ధికి కావాల్సిన వ్యాయామం, పంచేంద్రియాలను చేతనవంతం చేయగల అనుభవాలు, అంతర్గతమైన ప్రేరణలకు స్వేచ్ఛతో కూడిన ప్రతిస్పందనలు – వీటినన్నిటిని పిల్లలు స్వయంసిద్ధంగా ఎదగడానికి కావలసిన అవసరాలుగా గుర్తించాలి. నిరర్థకమైన చదువుల పేరున, క్రమశిక్షణ పేరున, లోతులేని ఆచారాల పేరున, అర్థంపర్థంలేని విలువల పేరున ఆంక్షలు, అంతరాయాలు కల్పించడం, పిల్లల సహజమైన ఎదుగుదలను కుంటుపరచడమే.

విద్య మూలాలు తెలిసిన విద్యావేత్తలు, పిల్లల వికసన క్రమం గురించి కృషి చేసిన శాస్త్రజ్ఞులు, సమాజ ప్రగతి కోరుకునే విజ్ఞులు అందరూ – నినదిస్తున్న సత్యం పిల్లల సమగ్ర వికాసానికి తోడ్పడేదే విద్య అని, వ్యక్తిబాగు, సమాజ పురోగతి రెండూ అలాంటి విద్య ద్వారానే సాధ్యం.

**సమగ్ర వికాసానికి అనువైన స్కూలు వాతావరణంలో పిల్లలు –**

- స్వచ్ఛమైన గాలి, సరిపడా వెలుతురూ, హాయిగా గెంతటానికి, ఆటపాటలకు సరిపడా చోటు, సమయం వారి హక్కుగా పొందగలగాలి.
- వారి దినచర్యలో సరిపడా విశ్రాంతి చోటు చేసుకోవాలి.
- బాల్యానందాలకు దూరం కాకుండా సంతోషంగా ఎదగాలి.

- అర్థవంతమైన చదువుల్లో భాగస్వాములవ్వాలి.
- హేతుబద్ధంగా ఆలోచించాలి.
- నేర్చుకోవడంలో క్రియాశీలక పాత్ర తీసుకోవాలి. స్వేచ్ఛగా ప్రశ్నించగలగాలి..
- బహుమతులు, శిక్షల వత్తిళ్ళలో సహజమైన సృజనాత్మకతను కోల్పోకూడదు.
- ఎలాంటి వివక్షలకు గురి కాకూడదు. అలానే వివక్షలను వుపేక్షించని సంస్కారులవ్వాలి.
- పోటీని ప్రక్కనపెట్టి సహకారాలను యిచ్చి పుచ్చుకోవాలి.
- ప్రకృతి వరాలు ముందు తరాలకు అందేలా వనరుల్ని పదిలంగా వాడుకోవాలి.
- ప్రకృతిలో యిమిడిపోయే సీదాసాదా బ్రతుకులో, కాయకష్టం చెమటలో సుఖశాంతులున్నాయని తెలుసుకోవాలి.
- అందరి మాటలూ వింటూ నలుగురిని కలుపుకుపోగల ఓర్పు నేర్పులతో ఆత్మస్థైర్యం అలవరచుకోవాలి.
- వ్యక్తిగా తాను చేరుకోగలిగినంత స్థాయికి ఎదగాలి.
- ప్రకృతి అందాలను ఆస్వాదించగలగాలి.
- హింసా ప్రవృత్తిని గర్హించాలి. శాంతి కాముకులుగా ఎదగాలి.
- జీవనశైలిని పర్యావరణ పరిరక్షణకు తోడ్పడేదిగా మలుచుకోవాలి.
- మానవత్వపు విలువలను ఆకళింపుచేసుకొని, మంచి చెడులను విచక్షణతో గుర్తించాలి.
- సహానుభూతి, ఆర్ధ్రతలకు లోనయే అనుభవాలుండాలి.
- వృత్తి నైపుణ్యతను సాధించి సమాజ సంపదను పెంపొందించే తమవంతు బాధ్యతను నిర్వర్తించాలి.

**చదువుల పట్ల సమాజ దృక్పథం మారాలి –**

విద్య బ్రతుకు తెరువు కోసమే కాదు – సమగ్ర జీవనానికి బాట వేసేదే విద్యగా పరిగణించాలి. అప్పుడే పిల్లలు సమగ్రంగా ఎదిగేందుకు విద్యా ప్రణాళికలు రచించుకోగలం.

సమగ్రమైన విద్యకు తరగతి గదులు సరిపోవు. వాటితోపాటుగా – చేతులకు పనిచెప్పే కార్యక్రమాలుండాలి; ప్రతిరోజూ ఆటలుండాలి; చిన్నా, పెద్దా అందరూ కలసి చేసుకోవాల్సిన పనులుండాలి; ప్రకృతితో, పరిసరాలతో అనుభవాలుండాలి; విజ్ఞాన యాత్రలుండాలి; చిత్రలేఖనం వుండాలి; లలిత కళలుండాలి.

బడిలో నేర్చుకోవడానికి పిల్లలకు స్వేచ్ఛ కావాలి. భయం వత్తిడి లేని వాతావరణంలోనే స్వేచ్ఛకు అర్థం వుంది. అటువంటి వాతావరణాన్ని టీచరు కల్పించాలి. టీచరుకు స్వేచ్ఛ వుంటేనే అది సాధ్యం. నేర్చుకోవడానికి అన్నిటికన్నా ఎక్కువ తోడ్పడేది విద్యార్థికి టీచరుతో వున్న చనువు. టీచరు ఎంత బాగా చెప్పారు అనేదానికన్నా, పిల్లలు ఎంత నిర్భయంగా ప్రశ్నలు అడగగలుగుతున్నారు అనేది కొలమానం కావాలి.

ఈనాడు చదువుల పేరున విద్యార్థులు రకరకాలుగా భయం, వత్తిళ్ళకు లోనవుతున్నారు–

- క్రమశిక్షణ పేరుతో శిక్షలు
- వయస్సుకు మించిన పుస్తకాల బరువు
- తోటి విద్యార్థులతో పోల్చి చిన్నబుచ్చడం
- అర్థం కాని బట్టీ చదువులు
- మార్కులు, ర్యాంకుల వేటలో సమవుజ్జీలు కాని వారితో పరుగుపందెం
- బహుమతులు రావనే భయం
- మాటలు పెగలని ఇంగ్లీషు మీడియం కష్టాలు
- వయస్సుకు మించిన సిలబస్
- విసుగు పుట్టించే హోంవర్కు
- ఇవన్నీ విద్యార్థికి చదువుల పట్ల విముఖత కల్గించేవే.

## నేర్చుకోవడం గురించిన శాస్త్రీయ అవగాహన

"నేర్చుకోవడం (Learning to Learn) విద్య లక్ష్యం కావాలి. వడివడిగా మారుతున్న ప్రపంచంలో యిమిడిపోగల సామర్థ్యాన్ని (adapt to change) చదువులు యివ్వగలగాలి." – కార్ల్ రాజెర్స్ (అమెరికన్ సైకాలజిస్టు – 1902–1987)

నేర్చుకోవడం గురించిన శాస్త్రీయమైన అవగాహన టీచర్లకున్నప్పుడే విద్యార్థులను సరైన రీతిలో పట్టించుకోగలరు. పిల్లలు నేర్చుకోవడంతో ముడిపడిన కొన్ని సత్యాలు – టీచర్లు తెలుసుకోవాలి.

- నేర్పడం సాధ్యం కాదు – నేర్చుకోవడానికి తోడ్పాటు ఇవ్వగలం అంతే.
- ప్రతి విద్యార్థి నేర్చుకోగలడు – తమదైన వేగంతో – రకరకాలుగా.
- ప్రతి విద్యార్థి బాగా చెయ్యాలనే అనుకుంటాడు.
- తను చెయ్యగలననే నమ్మకం నేర్చుకోవడాన్ని ప్రభావితం చేస్తుంది.
- అలానే నేర్చుకోవడం తనమీద నమ్మకాన్ని పెంచుతుంది.
- చేసిన పని ఫలితాలిస్తుంటే ఇంకా ఇంకా చేయాలనిపిస్తుంది.
- పోటీకంటే పరస్పర సహకారం నేర్చుకోవడానికి బాగా వుపయోగపడుతుంది.
- తప్పులు అందరూ చేస్తారు. నేర్చుకోవడానికి తప్పులు చేయడం తప్పనిసరి.

నేర్చుకునే ప్రక్రియ టీచరయ్యాక కూడా కొనసాగాలి. పిల్లల నుండి నేర్చుకునే అనుభవాల కోసం ఎదురు చూడాలి. తెలియనిది తెలియదని చెప్పగలిగే నిజాయితీ వుండాలి. అన్నిటికన్నా పిల్లల్ని బేషరతుగా ప్రేమించాలి.

విద్యార్థి కేంద్రంగా విద్యాబోధన జరగాలంటే, విద్యార్థులు నేర్చుకోవడంలో క్రియాశీలక పాత్ర తీసుకోవాలి. తరగతి గదిలో టీచరు గొంతు సగం సమయం కంటే తక్కువే వినబడాలి. అటువంటి వాతావరణాన్ని టీచరు కల్పించాలి.

టీచరుగా పిల్లల్లో సహజంగా వుండే సృజనాత్మకతను రక్షించాలి. సృజనాత్మకతను పెంపొందించేలా జ్ఞాన విజ్ఞానానికి ఎవరికి ఎంత అవసరమో అంతే తోడ్పాటునివ్వాలి. అరటిపండు వలవకూడదు. అలానే భావ వ్యక్తీకరణకు వీలైనన్ని అవకాశాలు కల్పించాలి.

అవి ఏ రూపంలోనైనా వుండవచ్చు – కథలు, బొమ్మలు, కవితలు, చేతిపనులు ఏవైనా కావచ్చు.

**సమగ్రజీవనంతోనే సమగ్ర వికాసం సాధ్యం :**

అవకాశం వున్నంతమేరకు, పిల్లలు సమగ్రమైన జీవనాన్ని రుచి చూడాలి. పరిసరాలను శుభ్రంగా వుంచడంలో పిల్లలు భాగస్వాములవ్వాలి – అంటే టీచరుతో పాటుగా, కూరగాయలు, ఆకుకూరలతో చిన్న తోటను పెంచుకోవాలి. బడి తోటను విలువైన ప్రయోగశాలగా, బోధనా మాధ్యమంగా టీచర్లు వుపయోగించుకోవాలి. రకరకాలుగా చేతి పనివాళ్ల పనులు స్వయంగా చూడాలి. వెరసి కాయకష్టాన్ని విలువగా చూసే వాతావరణంలో పిల్లలు ఎదగాలి.

**క్రమశిక్షణ :**

టీచర్లుగా తెలుసుకోవలసిన మరో విషయం – క్రమశిక్షణ అనేది విద్యార్థులు టీచరు కలిసి సమిష్టిగా నిర్వహించాల్సిన బాధ్యత. నేర్చుకోవడానికి అనుకూలమైన వాతావరణం ఎలా వుండాలో చర్చించుకుని ఒక ఒప్పందానికి వచ్చి, అది అమలయ్యేలాగా విద్యార్థులు టీచరు చూడాలి.

టీచరుగా ప్రేమను పంచితే ప్రతిఫలంగా ఎన్నోరెట్లు ప్రేమను తిరిగి పొందుతారు.

* * *

***"ప్రభుత్వాలు గానీ, మనం గానీ మన పిల్లలకి చదువు రాకుండా పట్టాలు రావాలనీ, జ్ఞానం లేకుండా ఉద్యోగాలు రావాలనీ, బాధ్యతలు లేకుండా అధికారాలు కావాలనీ, పాప పుణ్యాలతో నిమిత్తం లేకుండా సంపాదన పెరగాలనీ కోరుకుంటాం. ప్రజలు బుద్ధీ, జ్ఞానమూ, వీలైతే అంతరాత్మకూడా లేకుండా ఉంటేనే పరిపాలించడానికి ఏలినవారికి ఈజీగా ఉంటుంది. కాబట్టీ పాలకులు సంతోషంగా వుండాలంటే బాలభారతం, యువభారతం వీలైనంత నంగిగా, మెదడూ, నాలుక లేకుండా ఉండాలి. అలాగ ఉండాలంటే దానికి అవశరమైన విద్యావ్యవస్థ కావాలి. ప్రైవేటు విద్యా వ్యాపారం క్షేమంగా 3 పువ్వులారుకాయలుగా వుండాలి. ఈ ఎంట్రన్స్ పరీక్షలు, కోచింగ్‌లు ఉండాలి."***

# 7. ఈ చదువులెందుకు?

**– గౌరి,** సెల్ : 9441089829

"You make a difference in the world only when you do something that would otherwise not be done. That means working on self-assigned projects, not just on things that you have been hired to do."

– Jeff Schmidt
(Preface) Disciplined Minds

అసమానతా వ్యవస్థ కొద్దిమంది వ్యాపారస్తుల లాభాల కోసం, వారి ప్రయోజనాల కోసం మాత్రమే నడుస్తుంది. అందుకే వ్యవస్థలోని అసమానతల్ని నోర్మూసుకుని అంగీకరించి తలెత్తకుండా పనిచేసే బానిసజాతిని ఉత్పత్తి చేస్తుంది. అలాంటి జాతిని తయారుచేయడమే విద్య, ఉద్యోగాల లక్ష్యం. అందుకే చదువులోను, (పని) ఉద్యోగంలోనూ ఆరోగ్యకరమయిన సామరస్యం కంటే ద్వేషపూరితమయిన పోటీతత్వం ఉంటుంది. ఆహారం, విద్య, ఉద్యోగం మొత్తంగా జీవితమంతా కృత్రిమంగా సృష్టించబడిన 'మర్యాదస్తుల' గుంపులోని స్థానాన్ని కాపాడుకోడానికే సరిపోతుంది. వో నలుగురు ధనవంతుల ఆస్తులకి కాపలాకాయడం కోసం మొత్తం సమాజం, ప్రభుత్వాలు జనాభాలోని అత్యధిక శాతం మంది పౌరులు అంతా కలిసి తమ తర్వాతి బానిసల్ని కూడా ఉత్పత్తిచేస్తూ దానికే చదువు, బారసాల, పెళ్ళి, పిల్లలు, ఉద్యోగం, రాజకీయం, వ్యాపారం అనే పేర్లు పెట్టుకుంటోంది ప్రజ.

జీవితం పేరిట సాగే తతంగానికి తలొంచి మనల్ని సన్నద్ధుల్ని చేసేందుకు చేసిన ఏర్పాటే చదువు. ఒక క్రమ పద్ధతిలో 'అందరిలా' ఎలా బతకాలో, అలా బతకడం మాత్రమే ఎలా 'గౌరవప్రదమో', మరొకలా బతకాలనుకోవడం, భిన్నంగా ఆలోచించడం ఎందుకు 'ప్రమాదమో' చెప్పి చెప్పి ఒకే మూసలో కని, తిని, తొంగునే జనాభాని తయారుచేయడం జరిగింది. ప్రశ్నించడమైనా, తర్కించడమైనా, చర్చించడమైనా అది వ్యవస్థ కొనసాగడానికి ఉపయోగపడాలనేదే చదువుల సిద్ధాంతం. బడిలో క్రమశిక్షణ పేరిట పిల్లలపై రుద్దేది ఈ రకమైన పరోక్ష బానిసత్వాన్ని మాత్రమే. దానికే పౌరసత్వమని మరో పేరు.

జ్ఞానం పేరిట చేర్చుకున్న సమాచారం, నిపుణత కోసం నేర్చుకున్న పని అన్నీ కూడా స్వతంత్రంగా ఆలోచించడం కంటే పరాధీనతతో జీవితాన్ని రెండు భాగాలుగా విభజించుకుని, మరొకరి ప్రయోజనాల కోసం పనిచేస్తూ దానికి చదువు, ఉద్యోగం అనే అందమైన పేర్లు తగిలించుకోడానికి మించిన ఘరానా మోసం మరోటి లేదు. జ్ఞానమయినా,

ధనమయినా దేశంలోని, ప్రపంచంలోని జనం సంపాయిస్తున్నారంటే, వాట్ని వినియోగించుకుని అసమానతలని, స్వప్రయోజనాలని నెరవేర్చుకునే వర్గం అనుమతిస్తున్న మేరకు ఆ పరిమితుల్లో మాత్రమే. అందుకే ఈ తరగతి జనం రాజకీయాల్ని ప్రత్యక్షంగా ఎన్నడూ పట్టించుకోరు, పాల్గొనరు. అత్యధిక శాతం మందిని రాజకీయాలతో వారికి సంబంధం లేదనో, లేదా వారిది తటస్త వైఖరనో నమ్మించగలగడమే అసలైన రాజకీయం. అందుకే పార్టీలు, ఎన్నికలే కాని ప్రత్యామ్నాయ రాజకీయాలపై చర్చలు జరగవు. ప్రజాస్వామ్యం అంటే అర్థం ఆచరణలో తెలియదు.

అందుకే స్కూల్లో, ఆఫీసులో, ఇంట్లో, బయటా అన్నిచోట్లా 'మెజారిటీ' మాటే, చెల్లుబాటౌతుంది. ఎందుకంటే ఈ వ్యవస్థ తయారుచేసిన వారిలో మెజారిటీ ప్రజల ఆలోచనా విధానాన్ని ఈసరికే నిర్దేశించడం జరిగింది కనుక. అలా ఎవరికి వారు ఆలోచిస్తున్నామనే భ్రమలో ఉంచుతూ ఎవరేం ఆలోచించాలో, ఆచరించాలో కొద్దిమంది ప్రయోజనాలకోసం నిర్ణయించడమే ఈ చదువుల లక్ష్యం. ఈ క్రమంలో సొంతాలోచన, స్వతంత్ర ఉనికి భ్రాంతిలో రకరకాల సిద్ధాంతాలు, ప్రయోగాలు ప్రవేశిస్తాయి. వాటిమీద మళ్ళీ చర్చోపచర్చలు జరుగుతాయి. 'సమగ్ర వికాసం', 'మానవీయత' వంటి పదాలతో మేధావులు బురిడీ కొట్టిస్తారు. అతివాద భావజాలం కూడా ధనస్వామ్యానికి దాస్యం చేస్తుంది. ప్రయోగాత్మక విద్య, ఇంకా అనేకరకాల చదువులు 'భిన్నత్వం'కోసమేననే వాదన బయలుదేరుతుంది. కానీ నిజమేంటంటే అసమానతల్ని అన్యాయాల్ని ప్రశ్నించలేని బుద్ధిమాంద్యానికి వివిధ సిద్ధాంతముద్రలు తగిలించుకుని ఆ అరకొర భావజాలాలకి అనుగుణంగా 'విద్య'కి భాష్యాలు చెప్పుకోవడం జరుగుతుంది.

ఈ దేశంలోని తరగతి గది కూడా పార్లమెంటుకేం తక్కువ కాదు. ప్రతీ స్కూలు కులం, మతం, వర్గం, లింగం, ప్రాంతం తదితర వివక్షతలకి నిలువెత్తు రూపం. విద్యని కాదు, విద్య గురించిన భావనల్ని ప్రక్షాళన చేయాలి. చదువుల్ని కాదు, అసలు చదువులంటే సమాజంలో ఉన్న సంకుచిత తత్వాల్ని సమూలంగా నిర్మూలించాలి. స్వతంత్ర ఆలోచనా విధానమే సృజనాత్మకతకు నాంది. హేతుబద్ధమయిన భావ ప్రవాహమే నిర్మాణాత్మకతకు పునాది. అవి లేని చదువులు ఈనాటి అపసవ్య అసమానతా వ్యవస్థని కాపాడటానికి మాత్రమే పనికివస్తాయి. విదేశాల్లో ఎన్ని విలాసాల మధ్య గడుపుతున్నా, స్వదేశంలో ఎన్నంకెల జీతం తీసుకుంటున్నా, మీ పిల్లలు ఎంత ఖరీదైన స్కూల్లో చదూతున్నా, ఎంత పెద్ద ఇల్లు మీకున్నా, ఏయే పదవులు మీకు వచ్చినా, ఎన్ని రుచికరమైన పదార్థాలు మీరు తినగలుగుతున్నా మౌలిక ప్రశ్న అలాగే ఉంటుంది. జవాబు చెప్పాల్సింది మీరే. లేదంటే, అసలు మీ చదువులెందుకు??

* * *

# 8. చదువంటేనే విజ్ఞానం-చదవకపోతే అజ్ఞానం

- **మలయశ్రీ,** కరీం నగర్, సెల్ : 9866546220

చదువు అంటే విద్య. చదువు తెలుగుమాట. విద్య సంస్కృత పదం. దీని విలువ ఏమిటో ఎందరో మహాకవులు పూర్వం నుంచి వివరించుట జరిగింది.

**విద్యానామ నరస్యరూప మధికం.**
**ప్రచ్ఛన్న గుప్తం ధనం,**
**విద్యాభోగకరీ యశస్సుఖకరి**
**విద్యాగురూణాం గురుః...'**

అని భర్తృహరి "త్రిశతి" శ్లోకంలో ఉంది.

చదువు ఏమిటో అది యెందుకో బమ్మెరపోతన భాగవతంలో వివరించిన (ప్రహ్లాద చరిత్ర) ఈ పద్యం చూడండి.

**"చదువని వాడజ్ఞుండగు,**
**చదివిన సదసద్వివేక చతురత కలుగున్,**
**చదువగవలయును జనులకు,**
**చదివించెద నార్యులొద్ద చదువుము తండ్రీ!"**

నా పాట ఒకటి ఎప్పుడో రాసింది ఇట్లుంది.

**"చదువంటేనే విజ్ఞానం**
**చదువకపోతే అజ్ఞానం,**
**తెలువని దానిని తెలిపేది**
**తెలివిని విలువను పెంచేది**
**విలువైనదిరా చదువు-"**

ఒక్క మాటలో చెప్పాలంటే విద్యతో మనకు జ్ఞానం - విజ్ఞానం సమకూరుతుంది. ఇంకా - విద్య విలువైన ధనం. దొంగలకు దొరుకనిది. ఎంతగా దానం చేసినా తరుగక పెరిగేది! విద్యావంతులే నాడు ఉన్నత ఉద్యోగులుగా రాణించేవారు. ఇంచుమించు ఇప్పుడూ అంతే కదా.

అవన్నీ నాడు–నేడూ సమానమే. అయినా – విద్య కేవలం ఉద్యోగాల కొరకే, అనే భావం ఈనాడు మన జనాల్లో బాగా బలపడింది. పైగా విదేశ సాంకేతిక విద్యలు ప్రధానమై, దేశీయ వృత్తివిద్యలు – మాతృభాషలు నిరాదరణ పాలైనవి.

ఉద్యోగం కంటె మనిషికి జీవితం ముఖ్యం. వ్యక్తిగత స్వేచ్ఛ ముఖ్యం. ఏదో ఒక రంగం (విషయం)లో డిగ్రీలు పొంది, ఇతర రంగాల గురించి ఏమాత్రం పరిచయం లేకపోతే అది అజ్ఞానమే. అట్లా వ్యక్తుల మధ్య దూరం పెరుగుతుంది. నిజానికి విద్య ఇప్పుడు పూర్తిగా వ్యాపారమైంది. విద్య విజ్ఞానానికి కాదు, అది కేవలం ఉద్యోగాల కోసమే అనే భావం మన సమాజంలో స్థిరపడింది. శారీరక శ్రమ, వృత్తి విద్యలు ఉపేక్షింపబడుతున్నవి. కాలక్షేప వినోద సాధనాలైన లలితకళలు – క్రీడలు ఆదరం పొంది, చరిత్ర – సైన్సు నిరాదరణ పాలగుట ఒక వింత – విలోమ పరిణామం. అనుకరణ, ధనార్జన ప్రధానమైంది. సృజనాత్మకత సన్నగిల్లింది. కేవలం ఉద్యోగాశ చదువులు నిరుద్యోగుల పెంచుతున్నవి. ఎంతో ధనం కాలం ఇట్లా వృధా అవుతున్నది. అనాసక్తి – పెద్దల ఒత్తిడి చదువులు, ఆశించిన ఉద్యోగాలు రాక యువత నీరసపడుతున్నది. తల్లిదండ్రులు తమ పిల్లల బాగుకోరినా వారిని యంత్రాలుగా భావించి ఒత్తిడిచేయుట తగని పని.

ఇక, విద్య వివేకం పెంచి వ్యక్తుల నీతిపరుల చేయాలె, కాని, అదేమిటో అవిద్యావంతులకంటె ఉన్నత విద్య – ఉద్యోగాలు కలవారే ఎక్కువ అవినీతికి పాల్పడుతున్నరు.

విద్య వివేకాన్ని – సత్ప్రవర్తనను నేర్పుట తప్పనిసరి. ఒక ఆంగ్ల సూక్తి ఈ సందర్భంలో గుర్తుకు వస్తున్నది.

"ఇఫ్ వెల్త్ ఈజ్ లాస్ట్ – నథింగ్ ఈజ్ లాస్ట్,
ఇఫ్ హెల్త్ ఈజ్ లాస్ట్ – సంథింగ్ ఈజ్ లాస్ట్,
ఇఫ్ కేరెక్టర్ ఈజ్ లాస్ట్ – ఎవ్రీథింగ్ ఈజ్ లాస్ట్!"

'విద్య రానివాడు వింత పశువు' – అనేది పాత సామెత.
'విద్య నేర్చిన వాడు సంత పశువు' అన్నది ఇప్పటి మాట.

ఈ పరిస్థితి సరికాదు. దీన్ని మనమే (ప్రజలు – ప్రభుత్వం) మార్చాలె, మార్చుదాం – సెలవిప్పటికి, స్నేహమెప్పటికీ!

* * *

# 9. పెద్దలు పిల్లలతో చాలా నేర్చుకోవచ్చు

– **ప్రభ,** హైదరాబాద్, సెల్ : 8074765590

మనిషిని సృష్టించేది మనిషే ఫ్యాక్టరీ కాదు. అందుకే అందరూ ఒకేలాగా ఉండరు. మనము అందరమూ వెరే వెరే. ఏ ఒక మనిషీ రుచులలో, స్వభావంలో, నిపుణతలో ఒకేలాగా ఉండదు.

మాకు ఇద్దరు అమ్మాయిలు, శ్వేత, స్నేహ, కవల పిల్లలు. అయినప్పటికీ వాళ్ల స్వభావాలు, రుచులు వేరు. ప్రస్తుతం చాలా స్కూళ్ళలో ప్రతి మనిషి భిన్నం అని గుర్తించరు. ఆ విద్యావిధానంలో ప్రతి విద్యార్థికి ఒకేలాగా పాఠాలు చెప్తారు. ఫ్యాక్టరీలో పనిచెయ్యడానికి లేదా ఒకే రకం రంగాలలో పనిచేసేందుకు పనికొచ్చేలా తయారు చేస్తారు.

మేము చేసే చిన్న ప్రయత్నం ఏమిటంటే, పిల్లలను ఇలా నడిపించే విద్యావిధానంలో పంపించకపోవడం. ఈ విధానం ద్వారా పిల్లలు పసితనం, వాళ్ళ బాల్యం, ఎలాంటి ఒత్తిడి లేకుండా, పరీక్షలు, స్కూళ్ళ బస్సులు, పుస్తకాల బరువులు, ఎలాంటి బాదరబందీ లేకుండా ఉండాలని కోరిక.

నేను స్కూల్‌కి వెళ్లాను నా చిన్నపుడు కాని నాకు ఇప్పుడు అనిపిస్తోంది నేను ఏమి నేర్చుకోలేదు. రొటీన్‌గా చేస్తాను పనులు ఆలోచించకుండా, మేము ఇద్దరం కొన్ని సంవత్సరాలు ఐటి సెక్టార్‌లో పనిచేశాము. ఫుల్‌టైమ్ జాబ్ చేయము. ప్రస్తుతము అందరు ఇంట్లో ఉంటాము. మా ప్రయత్నం బడిని ఇంట్లో తేవడం కాదు. కలసి ఇంటి పని చేస్తాము. వంట పనిలో సహాయపడతారు. అలా కలిసి పనిచేస్తో చాలా విషయాలు మాట్లాడుకుంటాము. ప్రశ్న జవాబులు నడుస్తూంటాయి. పిల్లలతో చాలా నేను నేర్చుకుంటున్నా. ఆలోచించే విధానం మారింది.

మాకు చాలా ప్రశ్నలు వస్తూ ఉంటాయి..

రోజంతా ఏమిచేస్తారు ఉండి : మనకి స్కూల్ కండిషనింగ్ అలవాటు అయింది. మన ఆలోచనలు కూడా అలానే ఉంటాయి. కూర్చుని ఆలోచిస్తే అనిపిస్తుంది, రోజు స్కూల్‌కి వెళితేనే పిల్లలు నేర్చుకుంటారా. ఇంట్లో ఉండి కూడా చాలా నేర్చుకోవచ్చు. వయస్సుకి నేర్చుకోవడానికి సంబంధం లేదు. వారంలో రెండు రోజులు మ్యాథ్స్ చేస్తారు. మ్యాథ్స్‌లో కూడా వాళ్ళ లెర్నింగ్ కెపాసిటీ బట్టి చేస్తారు. వయస్సు బట్టి కాదు.

శ్వేతకి బుక్స్ చదవడం ఇష్టము. తను చాలా టైమ్ బుక్స్ చదువుతూ ఉంటుంది. స్నేహ బుక్స్ ఇంకా చేతి పనులు చేయడం ఇష్టము. టైలరింగ్ ఇష్టము. ఇంట్లో సూయింగ్ మిషన్ ఉంది. అది ఆపరేట్ చేస్తారు. ఐడియాస్ ఉంటాయి. అది ఇంప్లిమెంట్ చేస్తారు. సూయింగ్ మెషిన్ పెద్దవారు మాత్రమే ఆపరేట్ చెయ్యాలి అన్న రిస్ట్రిక్షన్ ఏమీ లేదు. గ్యాస్ స్టవ్, కటింగ్ డేంజరస్ అన్న భయం లేకుండా ఆపరేట్ చేస్తారు. వాళ్లమీద మనకి నమ్మకం ఉండాలి. అది కూడా ఒక అనుభవం. అప్పుడు కొత్త ఆటలు, ఆలోచనలు పుట్టుకు వస్తాయి.

పిల్లలు వేరే పిల్లలతో కలవగలరా? సోషల్‌గా ఉంటూ స్కూల్ సోషల్‌గా ఉండాలని నేర్పించదు. నేను కూడా స్కూల్‌కి వెళ్ళేను. నా అనుభవంలో నాకు ఎక్కువ ఫ్రెండ్స్ లేరు. పిల్లలు సాయంత్రం పిల్లలతో ఆడుకుంటారు. ఒక లెర్నింగ్ సెంటర్‌కి వెళతారు వారంలో 3 రోజులు అక్కడ వేరే స్నేహితులతో ప్రాజెక్ట్స్ చేస్తారు. మేము కలిసి ట్రావెలింగ్ చేస్తాము. వేరే చాలా యాక్టివిటీస్ జనాలని కలుస్తాము. వాళ్లని అబ్జర్వ్ చేసి కూడా నేర్చుకుంటారు.

### కొన్ని రిస్ట్రిక్షన్స్ :

ఇంటిలో టివి లేదు. పిల్లలని టివి ఎంటర్‌టైన్ చేస్తుంది. బోర్ కొడితే టివి చూస్తారు. టివి లేకపోతేనే అని ఆలోచించండి – టివి మనకి కంటిన్యూగా ఏదో చూపిస్తూ మనలని ఎంటర్‌టైన్ చేస్తూ ఉంటుంది. మనము మనలని ఎంటర్‌టైన్ చేసుకోవాలి. మ్యూజిక్, డ్యాన్స్ నేర్చుకుంటారు. ఇంటర్నెట్ ఉంది. పిల్లలు మూవీస్ చూస్తారు. కాని టైమ్ లిమిట్ పెట్టాము. వారంలో 4 గంటలు స్క్రీన్ టైమ్. వాళ్ళు డిసైడ్ చేస్తారు. ఆ 4 గంటలు వారంలో ఎప్పుడు చూడాలో.

లెర్నింగ్ ఈజ్ ఆన్‌గోయింగ్ ప్రోసెస్. బడికి పంపిస్తేనే లెర్నింగ్ అవుతుంది అని లేదు. లెర్నింగ్ ఎప్పుడూ ఆగదు. స్కూల్‌కి వెళ్ళినా వెళ్ళకపోయినా లెర్నింగ్ ఉంటుంది. స్కూల్ విధానము ఆ లెర్నింగ్ డైరెక్షన్ మారుస్తుంది. ఆలోచించే ఫ్రీడం ఇవ్వదు.

మనము పిల్లలని పిల్లలుగా కాదు, ఒక ఇండివిద్యువల్‌గా ట్రీట్ చెయ్యాలి. వాళ్ళు కూడ ఆలోచించగలరు. పెద్దలు పిల్లలతో చాలా నేర్చుకోవచ్చు.

* * *

# 10. చదువంటే?

– డి.ఆర్. ఇంద్ర, రాజమండ్రి, సెల్ : 9490169068

"స్కూలెగ్గొట్టి బలాదూర్ తిరుగుతావా? మట్టిగొట్టుకుపోతావ్! చదువుకోకపోతే చంకనాకిపోతావురా వెధవా!"

హైస్కూల్‌లో వుండగా మేష్టర్లు చెప్పే నిస్సారపు పాఠాలు బోర్‌కొట్టి వినబుద్ధి కాక, క్లాసులో వుండాలనిపించక మెల్లిగా జారుకుని రోడ్డెక్కి, కలువలు నిండిన చెరువుగట్లమ్మటా, ఎగురుతూన్న చేపపిల్లలూ, నీటి పాములూ, కప్పలతో నిండివుండే కాలవగట్లమ్మటా, రెల్లుపొదలూ – వాటి మధ్య దాగి తొంగి చూసే జింకపిల్లల్తో కళకళలాడే గోదావరి ఏటిగట్లమ్మటా స్వేచ్ఛగా ఆనందిస్తూ తిరుగుతూ ప్రకృతి రహస్యాల్నీ, అందాల్నీ పరిశీలిస్తూ, ఆస్వాదిస్తూ, ప్రకృతినే గురువుగా చేసుకుని ప్రకృతినుండే పాఠాల్ని నేర్చుకునే ప్రయత్నాలు చేసినందుకు పెద్దలు ఇచ్చిన ఆశీర్వచనాలపై తిట్లు! గొప్ప పెద్దలు! అర్థశతాబ్దంనాటి సంగతి ఇది. ఇప్పటికీ ఆ స్కూళ్ళు మారలేదు. ఆ పెద్దలూ మారలేదు. మార్పులేని పురాతన విద్యావ్యవస్థ! పురాతనం అన్నా, సనాతనం అన్నా మనకి మహా గౌరవం కదా. అందుకే ఇంకా సనాతన అస్ప్రృశ్య ధర్మాల్ని పాటిస్తూ పురాతన రాతియుగ మానవ సంస్కృతిలోనే జీవిస్తూన్నాం. మనకి సాటి ఎవరు మనం తప్ప. భావ దారిద్ర్యాన్ని మనం ప్రేమించినంతగా మరెవరూ ప్రేమించలేరు. మనం గొప్ప ప్రేమికులం కదా.

ఇంతకీ చదువు లేక విద్య అంటే ఏమిటి? చదువుకి నిర్వచనాలు సవాలక్ష వున్నాయ్. వాటి జోలికి పోను. విద్ అనే ధాతువుకి తెలుసుకోవడం అని అర్థమనీ, తెలుసుకోవడాన్నే విద్య అనీ విద్యని నేర్పడాన్నే విద్యాబోధన అంటారనీ నా బి.ఇడి. ఎమ్.ఇడి. చదువుల్లో తెలుసుకున్నాను. ఐతే దేన్ని తెలుసుకోవడం, దేన్ని బోధించడం అనే ప్రశ్నలు వస్తాయ్. మనచుట్టూ వున్న సమస్త ప్రకృతినీ – చెట్టుచేమలూ, కొండలూ, లోయలూ, సమస్త జీవజాలమూ, పైన కనిపించే విశాలాకాశమూ సూర్యచంద్రుళ్ళూ నక్షత్రాలూ, మబ్బూ, వానా, నిప్పూ, గాలీ – ఇవన్నీ ఏమిటి; ఎక్కడి నుండి ఎలా వచ్చాయ్, మనం ఎక్కడినుంచి ఎలా ఎప్పుడు వచ్చాం అనే జిజ్ఞాసే, ప్రశ్నల పరంపరే, తెలుసుకోవాలనే ఆకాంక్షే ఆలోచనలకీ, పరిశీలనకీ, దాని ఫలాలే విజ్ఞానంగా మారడమూ ఏకకణ జీవి నుంచి తిమింగలం వరకూ సమస్త జీవజాలమూ తన చుట్టూ వున్న పరిసరాలను గమనిస్తాయ్, తెలుసుకుంటాయ్. జీవించడానికీ, జీవించడానికి అవసరమైన కొన్ని నైపుణ్యాలను అభివృద్ధి చేసుకోడానికే ఈ పరిశీలన, విశ్లేషణా తప్పనిసరి జీవలక్షణాలు. అంటే విద్య మనుషులకే కాదు అన్ని జీవులకీ అవసరమే మనుగడకోసం. అందుకే ప్రతిజీవీ తనదైన పరిసరాల జ్ఞానాన్ని కలిగి వుంటుంది. జీవకోటిలో ఆఖర్నపుట్టినా ఎవాల్యూషన్‌లో పైమెట్టుమీద ఉన్నాడు కాబట్టి మనిషికి పరిసరాల జ్ఞానాన్నే కాక

అంతకుమించిన ఈ విశ్వాన్ని అర్థం చేసుకోవాల్సిన అవసరం ఏర్పడింది. ఈ జ్ఞానాన్వేషణే చదువుగా పరిణమించింది. అదిలేనివాడ్ని పశుప్రాయుడుగా పేర్కొవడమూ జరుగుతోంది. ఈ భౌతిక ప్రపంచాన్ని అర్థం చేసుకోవడంలో, దాన్ని జీవితానికి అన్వయించుకోవడంలో ఈ దేశంలో రెండు విభిన్న మార్గాలూ పద్ధతులూ ఏర్పడ్డాయ్. వాటి మధ్య వైరుధ్యాల వల్ల ఘర్షణలూ పుట్టుకొచ్చాయ్, ఒక వర్గాన్ని మరో వర్గం తీవ్రమైన హింసతో అణచివేయడమూ జరిగింది. ఈ దేశంలో ఆర్యుల ప్రవేశానికి ముందటి సింధూ నాగరికత ఉచ్ఛస్థితికి చేరుకోడానికి కారణమైన విద్యావ్యవస్థ కానీ, చార్వాకాది భౌతికవాదులు విజృంభణకి దోహదం చేసిన వారి విద్యావ్యవస్థ కానీ ఎటువంటివో తెలుసుకోడానికి మనకి ఆధారాల్లేవు. అవి నిర్మూలించబడ్డాయేమో. ఆర్య సంస్కృతి మాత్రం దైవ మత విశ్వాసాల ఆధారంగా సృష్టికర్త భావంతో ప్రకృతినీ విశ్వాన్నీ అర్థం చేసుకోడానికి ప్రయత్నించింది. దాని ఫలితమే గొప్ప భారతీయ విజ్ఞానంగా చెలామణీఅయ్యే వేదాలు, ఉపనిషత్తులూ, దర్శనాలు, పురాణాలూ. ఇది అసలు సిసలు జ్ఞానమైన భౌతికవాద విజ్ఞానాన్ని చెత్తగా కొట్టిపారేసాయ్. దాంతో నకిలీ నాణెమే అసలు నాణంగా, కాకి బంగారమే మేలిమి బంగారంగా, అశాస్త్రీయమైన మత విశ్వాసాలే శాస్త్రాలుగా చెలామణీ అవుతూ వచ్చాయ్. దీనికి ఈ దేశ పాలక పురోహిత వర్గాల దన్ను బాహాటమే. అందువల్లే ఈ దేశంలో సైంటిస్ట్‌లకి లేని గౌరవం ఆధ్యాత్మిక శాస్త్రవేత్తలూ, పొట్టకోస్తే అక్షరం ముక్కలేని నిరక్షరకుక్షులైన ప్రవచనకారులూ సమాజహితకారులుగా చెలామణీ అవుతూ పాదపూజ లందుకుంటున్నారు. ఇటువంటి నేపథ్యంలోంచి వచ్చినవాళ్ళు సైంటిస్టులై రాకెట్స్‌ని అంతరిక్షంలోకి పంపేముందు వాటి నమూనా రాకెట్స్‌ని గ్రామ అమ్మవార్ల పాదాల ముందు పెట్టి బొక్కబోర్లాపడి అవి సరిగా ఎగిరేట్టు చెయ్యమని ప్రార్థించేవాళ్ళని విద్యావంతులు, చదువుకున్నవారు అనవొచ్చా? నాకు అనబుద్ధి కాదు. సంఘటనల కార్యకారణ సంబంధాల్ని గ్రహించలేని వాడ్ని మూఢులు అనక విద్యావంతులనడం ఎలా సబబో అర్థం కాదు. ఇటువంటి కుహనా శాస్త్రజ్ఞుల వల్ల సమాజానికి తప్పుడు సంకేతాలు చేరవా? ఆలోచనల్లో, ఆచరణలో శాస్త్రీయత లోపించడం వల్ల చదువు వల్ల లభించాల్సిన ప్రయోజనాలు కొరవడవా? కానీ దురదృష్టం కొద్దీ దైవమత విశ్వాసాలతో కూడిన, ఆధ్యాత్మికత, భక్త భజనలతో కూడిన నమ్మకాల్ని విద్యాలయాల్లో, పిల్లల, యువత మెదళ్ళల్లో తెలివిగా సంస్కృతి పేరిట చొప్పించడం నేటి పాలకులు చేస్తూండటం దోపిడీ పాలనకి ఆటంకాలు లేకుండా చేసుకోవడానికే. ఆధ్యాత్మికతా భక్తి విశ్వాసాలు ఒక ఊబి. ఊబిలో పడ్డ దున్నలు పైకి రాలేనట్టే ఈ యువతా ఈ దుష్ట సంస్కృతి ఊబిలో పడి కూరుకుపోతూండటం విచారకరం. అమాయక ప్రజల్ని తన్ని వశం చేసుకోనక్కర్లేదు – తప్పుడు విద్యా విధానం చాలు. దాన్నే మన పాలకులు అమలు చేస్తున్నారు. ప్రశ్నించేవాళ్ళే కరువైన సమాజంలో పాలకుల వికృత క్రీడకి అంతు వుండదు.

* * *

# 11. విద్య-దాని ప్రాముఖ్యత

– **Sk. కరీముల్లా,** చిలకలూరిపేట, సెల్ : 9705450705

"విద్య అంటే చారిత్రకంగా ఒక సామాజిక, సాంస్కృతిక ప్రక్రియ"

సమాజం యొక్క అవసరాలు తీర్చటం కొరకు పిల్లల్లో సృజనాత్మకమైన మానవీయమైన శక్తులను మేల్కొల్పుతుంది విద్య. అలాగే విద్య ఒక నవ సమాజాన్ని నిర్మించే పాత్రను నిర్వహిస్తుంది. అందుకే ఏ దేశంలోనైనా జాతి నిర్మాణానికి విలువలు కలిగిన విద్యార్థులను తయారు చేయాలంటే మంచి విద్యా విధానం అందరికీ అందుబాటులో ఉండాలి. విద్య సామాజికం. బడి ఒక వ్యవస్థ. మానవ జాతి ఇప్పటిదాకా సంపాదించిన జ్ఞానాన్ని, చరిత్ర, సంస్కృతి, సాంప్రదాయాలు, సాహిత్యం, సమస్త కళలను ఒక తరం నుండి మరొక తరానికి అందించే వ్యవస్థ. అట్టహాసంగా అపార్టుమెంట్లలో ఎ.సి. గదులలో వ్యాపారం చేసేది, విద్య (బడి) కాదు. అక్కడ బోధించేది విద్య కాజాలదు. విద్య ఒక జాతి భవిష్యత్తును తీర్చిదిద్దే అత్యున్నత వ్యవస్థ. ఆ దేశ అభివృద్ధి, ప్రణాళికలు ఆ దేశం తనకు ఎలాంటి మనుషులను కోరుకుంటుందో ఎలాంటి విజ్ఞానం కావాలని కోరుకుంటున్నదో ఆ దేశ విద్యావ్యవస్థను చూస్తే చాలు తెలిసిపోతుంది. అందుకే కొఠారి కమిషన్ "రేపటి తరం నేటి తరగతి గదిలో రూపుదిద్దుకుంటుంది'' అని వ్యాఖ్యానిస్తూ, ప్రభుత్వాలను హెచ్చరించినది. అలాగే ప్రభుత్వం విద్యారంగాన్ని నడపాలని జి.డి.పి.లో 6% విద్యారంగానికి కేటాయించాలని గట్టిగా సూచించినది.

భారత రాజ్యాంగం దేశంలో సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని సాధించటం తన లక్ష్యంగా ప్రకటించుకొంది. అందరికి విద్యను ఒక సాధనం చేసింది. రాజ్యాంగ లక్ష్యాలు సాధించటానికి విద్యకు ఎంతో ప్రాధాన్యత నిచ్చింది. అయినా స్వాతంత్ర్యం సిద్ధించి 73 సం॥లు అయినా నేటికి దేశ అవసరాలు తీర్చగలిగే ప్రజాతంత్ర విద్యావిధానం ఏర్పడలేదు. ఇప్పటికి బ్రిటీష్ మెకాలే విద్యావిధానమే కొనసాగుతూ ఉంది. మనదేశ విద్యను ఒక సరకుగా మార్చివేసి, విద్యను వ్యాపార సరుకుగా పాలకులు చలామణి చేస్తున్నారు. దీని కారణంగా పేదలకు విద్య దూరమైపోయింది. తెలుగు రాష్ట్రాలలో ఒకటవ తరగతిలో 100 మంది చేరితే 10వ తరగతి వరకు వచ్చేలోపు 38% మంది చదువును మధ్యలో వదలివేస్తున్నారు. ప్రభుత్వ పాఠశాలలు తీవ్రమైన మౌలిక వసతుల కొరతతో కునారిల్లుతున్నాయి. దేశం ఇప్పటికి 64% అక్షరాస్యులను కూడా దాటలేక పోయింది. ఇప్పటికైన పాలకులు కళ్ళు తెరచి రాజ్యాంగ విలువల ప్రకారం కుల, మత, ప్రాంతీయ, పేద, ధనిక వ్యత్యాసాలు లేకుండా దేశంలోని పిల్లలందరికి ఒకే రకమైన విద్యా వ్యవస్థను దేశీయ భాషలలో ఏర్పాటు చేయాలి. కామన్ స్కూల్ విద్యా విధానమును ప్రవేశపెట్టి విలువలతో కూడిన విద్యను రేపటి తరానికి అందించాలి. అప్పుడు మాత్రమే రేపటి తరం తరగతిలో రూపుదిద్దుకుంటుంది. మెరుగైన సమాజాన్ని నిర్మిస్తుంది.

* * *

# 12. బహుజనులకు చదువే సర్వం

**- పిల్లా చంద్రం,** కొడవలి, సెల్ : 9949804753

నా పేరు పిల్లా చంద్రం నేను తూర్పుగోదావరి జిల్లాలో గొల్లప్రోలు మండలం కొడవలి గ్రామంలో పుట్టాను..

నేను పదో తరగతి వరకు చదువుకున్నాను 10వ తరగతి నేను ఫెయిల్ అయిన తరువాత మా సొంత ఊర్లో పొలం పనులకు పరిమితమై పోయాను. కానీ చదువు విలువ తెలిసిన తరువాత పిల్లల చదువులు కోసం ఏదైనా చెయ్యాలి అనే ఆలోచనతో 2018 వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ పాఠశాలల పేరెంట్స్ అసోసియేషన్ ను ఏర్పాటు చేసి రాష్ట్రంలో ఉన్న సుమారు 360 సాంఘిక సంక్షేమ, గురుకుల వసతి గృహాలు, స్కూల్స్ తిరిగి ప్రతి స్కూల్ ల్లో ఉన్న మౌలిక సదుపాయాలు, భోజన నాణ్యత సదుపాయాలు చూసి లోపాలు ఉంటే అధికారుల దృష్టికి తీసుకువెళ్తూ పిల్లల విద్యాభివృద్దే ధ్యేయంగా ముందుకు సాగుతున్నాము.. వ్యక్తి మానసిక వికాసానికి, జీవన విధాన ప్రమాణాలు మనకు నేర్పుతూ, గత చరిత్ర, ఇప్పటి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించేదే విద్య.. సర్వ మానవాళి అభివృద్ధికి విద్య చాలా అవసరం.. అయితే ఈ కంప్యూటర్ యుగంలో చదువులేనిదే బ్రతకడం చాలా కష్టం.కోర్టు ఆర్డర్స్ మొదలుకొని ప్రభుత్వ జీవోలు చివరకి మొబైల్ ఫోన్ లు కూడా ఇంగ్లీష్ భాష లొనే ఉంటున్నాయి. అదే విధంగా రాష్ట్రంలో ఉన్న పిల్లలు ఎంతో మంది పిల్లలు నాణ్యమైన విద్యకు దూరంగా ఉన్నారు. దురదృష్టవశాత్తు మన దేశంలో విద్య వ్యాపారంగా మారింది. నాణ్యమైన విద్య సామాన్యులకు అందని ద్రాక్షగా మిగిలిపోతుంది. ప్రపంచానికి సంబంధించిన అన్ని రంగాల్లో రాణించాలంటే ఇంగ్లీష్ భాష చాలా కీలకమైన పాత్రపోషిస్తుంది. ఈ రోజున ఎంతోమంది పేదలు వారి పిల్లలను ఇంగ్లీష్ మీడియంలో చదివించాలి అని కోరిక ఉన్నా ప్రైవేట్, కార్పొరేట్ స్కూల్స్ లో ఫీజులు కట్టలేక తెలుగు మీడియంకే పరిమితమవుతున్నారు.. పదవ తరగతి దాటిన తర్వాత ఇంగ్లీష్ మీడియం లో ఉన్నత చదువులు అర్థం కాక, చదవలేక మధ్యలోనే చదువును వదిలేసే పరిస్థితి చాలా కుటుంబాలలో ఉంది. కాబట్టి ప్రభుత్వం అన్ని పాఠశాలలలో ఇంగ్లీష్ మీడియం బోధన పెట్టాలి.ఉన్నత విద్య అంత ఇంగ్లీష్ భాషలొనే ఉంటుంది. విదేశాల్లో చదవాలన్నా, ఉద్యోగం చేయాలన్నా ఇంగ్లీష్ భాషదే ప్రధాన పాత్ర. ప్రైవేట్, కార్పొరేట్ విద్య సంస్థలు విద్యను వ్యాపారంగా మార్చి వేల కోట్ల రూపాయలు వ్యాపారం సాగిస్తున్నారు మనదేశంలో వేల సంవత్సరాలు కొన్ని

కూలాలను చదువుకు దూరం చేశారు.. పూలే, అంబేద్కర్ లాంటి మహనీయుల కృషితో ఈ రోజు దేశంలో ప్రతి ఒక్క పౌరుడు చదువుకొంటున్నాడు. చదువు సాంకేతిక పరిజ్ఞానంతోనే దేశాభివృద్ధి సాధ్యం. అభివృద్ధి చెందిన దేశాలలో అక్షరాస్యత శాతం ఎక్కువగా ఉండటమే దీనికి నిదర్శనం. మన దేశంలో విద్యను ఉచితంగా అందించాలి. ఏ ఒక్కరు ఆర్థిక, సామాజిక కారణాల రీత్యా చదువుకు దూరం కాకూడదు అని ఆంధ్రప్రదేశ్ పాఠశాలల పేరెంట్స్ అసోసియేషన్ విద్యావ్యవస్థ అభివృద్దే ధ్యేయంగా పని చేస్తూ ఉంది. ప్రతి జిల్లాలో పిల్లల తల్లిదండ్రులను ఏకం చేస్తూ అంచెలంచెలుగా గ్రామ స్థాయి వరకు సంఘాన్ని బలోపేతం చేసి ప్రభుత్వ పాఠశాలల అభివృద్ధికి దోహదపడే విధంగా పని చేయడమే మా కర్తవ్యం. ఈ రెండు సంవత్సరాల కాలంలో ప్రభుత్వ అధికారులు ప్రజాప్రతినిధులతో ఎప్పటికప్పుడు చర్చిస్తూ అనేక అభివృద్ధి కార్యక్రమాలు చేయడానికి ఆంధ్రప్రదేశ్ పాఠశాలల పేరెంట్స్ అసోసియేషన్ ఎంతో కృషి చేసింది. ఈ కృషి చేయడానికి అనేకమంది మేధావులు వారి యొక్క సలహాలు సూచనలు ఆలోచనలు తీసుకుంటూ ముందుకు వెళుతుంది. చాలామంది మేధావులు మద్దతు తెలియజేస్తున్నారు.

రిటైర్డ్ ఐఏఎస్ ఐపీఎస్‌లు మొదలుకొని సామాన్య ప్రజలతో సహా అన్ని వర్గాలకు సంబంధించినటువంటి మేధావుల సలహాలు, సూచనలు తీసుకుంటూ చదువు తప్ప వేరే మార్గం లేదని ప్రజలకు తెలియజేస్తూ నిజమైన పేద ప్రజల నాణ్యమైన చదువు కోసం పనిచేయాలని నిబద్ధతతో జిల్లా కమిటీలు రాష్ట్ర కమిటీ సలహాదారులతో ప్రతి విషయాన్ని చర్చిస్తూ ముందుకి వెళ్తున్నాం.

చదువుతోనే దేశ అభివృద్ధి సాధ్యం కాబట్టి భారత ప్రభుత్వం దేశ పౌరులందరికి ఉచిత నిర్బంధ విద్యను అందించాలని కోరుకుంటున్నాము.

* * *

***"మనకి మన పిల్లల్ని జాగ్రత్తగా ప్రేమగా భద్రంగా చూసుకోవాలని తెలీదు. తెలిస్తే మనం రుద్రాక్ష పిల్లుల్నీ, కాశ్మీరు జాతిగోముఖ వ్యాఘ్రాల్ని చేరనిచ్చేవాళ్ళం కాదు. మనకి మన భవిష్యత్తు మీద, వర్తమానం మీదా అభిమానం లేదు. ఉంటే మన పిల్లల కోసం ఒక స్వర్గాన్ని నిర్మించుకునే వాళ్ళం. అందుకోసం ఎంత యుద్ధాన్నయినా చేసేవాళ్ళం."***

# 13. చదువు గుదిబండ కాదు

**– కృష్ణవేణి,** పార్వతీపురం, సెల్ : 7997062668

చదువంటే ఏంది, అసలది ఎందుకు? ఇప్పుడు ఇలా అడగడం వింతగా అనిపించొచ్చు. చదువు ఎందుకని ప్రశ్నించడం ఏంటి? చదివితే బాగుపడతారు, గొప్ప పేరు తెచ్చుకుంటాం. ఇంకా ఉద్యోగం సంపాయిస్తాం. ఏవీలేని స్థితి నుండి ఉన్నత స్థితికి చేరుకుంటాం ఇంతేనా?

అమ్మ ఒడిలో కూర్చొని అక్షరాభ్యాసం చేయించడం మొదలు అంగాన్వాడీ దాక విద్యాభ్యాసం నిరాటంకంగా అంచెలంచెలుగా జరగాలనేదే అభిలాష. ఐతే, అలా జరుగుబాటుకల విద్యార్థులు కొద్దిమంది మాత్రమే.

చదువనేది పుస్తకాలతోనే వస్తుందా? పుస్తకాలు చదివితేనే జ్ఞానం ఉన్నట్లు లేకపోతే లేనట్లా? కాదు. పుట్టుక నుంచి పోయేవరకూ సమాజం నుంచి, వ్యక్తుల నుండి, ఎదురయ్యే ప్రతి అనుభవం జ్ఞానమే కదా.

చదువు ఏదో రకంగా స్థిరపడడానికేనా? కాదు. చదువుకోకపోతే దేనికి పనికిరారనే భావనతో పెద్దలు పిల్లల్ని అడుగుతుంటారు, మీరు పెద్దయ్యాక ఏమౌతారంటూ .... దానికి వాళ్ళు ఇంజనీర్, డాక్టర్, టీచర్, పోలీస్, కలెక్టర్ అంటూ చెబుతుంటారు. చదువు ఇందుకోసమేనా?

అక్షర జ్ఞానం, అంకెల జ్ఞానం, పరిసరాల జ్ఞానం, ప్రార్ధనా జ్ఞానం. చదువు బాల్యానికి బడిని అలవాటుచేసే వేదిక. సాటి మనుషుల పట్ల గౌరవాన్ని, తోటి జీవుల ఎడల ప్రేమని పెంపొందించే మాధ్యమం విద్య.

బాగా చదివేవారికి పొగరు అనే పొగడ్త నాకెందుకో పేలవంగా అనిపిస్తుంది. చదువుకున్నామనే అహంకారులకంటే అక్షరజ్ఞానం లేకున్నా సమయస్ఫూర్తి, జ్ఞాపకశక్తి, తెలివితేటలుండే నిరక్షరాస్యులే బాగనిపిస్తారు. వాళ్ళముందు ఏం పనికొస్తాం అని ఆశ్చర్యం వేస్తుంది.

ఒకసారి నేను పనిచేస్తున్న స్కూల్ దగ్గర పొలం పనిచేసుకునే కష్టజీవి ఒకామె పనిపట్ల జీవితంలో నా దృక్పథాన్నే మార్చేసింది. అప్పుడే అనుకున్నా, ఫార్మల్ చదువు లేని జ్ఞానం సూపర్ అని!

ప్రస్తుతం పిల్లలు టెక్ట్స్‌బుక్ జ్ఞానంతో పెరుగుతున్నారు. ఎక్కువమంది గ్రేడ్స్, ర్యాంక్స్, టార్గెట్స్, హైస్కోర్ మార్క్స్‌కే పరిమితం అవుతున్నారు. ఇంతకు మించిన స్పృహ వారికి కలగడం లేదు.

పిల్లలపై ఎడ్యుకేషన్‌ని గుదిబండలా రుద్దుతూ వార్ని మన హెూల్డ్‌లో ఉంచుతూ చిన్నప్పటి నుంచే పిరికితనాన్ని, సున్నితత్వాన్ని నేర్పుతూ చెడగొడుతున్నామనిపించింది. మంచి జ్ఞానం మానవీయ ఆచరణే అని నేర్పాలి. ఆరో తరగతి చదూతున్న మా పాప రాసిన వాక్యాలతో ఈ వ్యాసం ముగిస్తాను.

*"నాకు తెల్సినంత వరకూ చదువంటే ప్రపంచం గురించి మనకి తెల్సింది కాకుండా మరింత తెల్సుకోవడం. ఒకదాని గురించే కాకుండా రకరకాల పనులు గురించి, జంతువుల గురించి, వాతావరణం గురించి, వస్తువులు గురించీ తెలుసుకోవడానికి ప్రయత్నించడం.*

*అలా తెలుసుకోడానికి పుస్తకం అవసరం. ఏదో గొప్పకోసం కాకుండా నిజంగా మనకి మనం చదివితే ఎంత తెలుసుకోవచ్చో కదా! ఎంత పేదవారైనా, ధనవంతులయినా పుస్తకం చదివే జ్ఞానంతో పైకొస్తారే కాని ఎలాగో రారు.*

*మనం ఎంత నిజాయితీగా చదువుతామో, అంతే నిజాయితీగా పెరుగుతాము. పెద్దలు మన మంచి కోసం చెప్పే విషయాలు కొన్ని కంపరంగా అనిపించినా అది మన కోసమే అని అర్థం చేసుకోవాలి. అప్పుడే మనకు వాళ్ళంటే ప్రేమ తగ్గకుండా వేదన కలగకుండా ఉంటుంది."*

* * *

***"ఏదో ఒక రకంగా మన పిల్లలందరూ అనాథలే. అనాథలు కాని పిల్లలు ఈ దేశంలో ఎవరైనా ఉన్నారా? మంచిగాలా? శుభ్రమైన నీరా? చక్కని, చల్లని చదువా? ఆరోగ్యకరమైన భోజనమా? రంగురంగు మబ్బుల మీద ఊహాలోకంలో చల్లని గాలితెరల మధ్య పల్టీలు కొట్టగల సీతాకోక చిలుకల అమాయకత్వమా? వాటి తేజోవంతమైన స్వేచ్ఛా? రెక్కల గుర్రాలు మీ పిల్లలకి కిటికీల గుండా వచ్చి వాళ్ళ పుస్తకాల బల్లలమీద హెూయలు పోతూ దిగుతున్నాయా? తెల్లవారి గాలికి ఊగే గన్నేరుపూలు తెంపి, వాటి కాడల్లోని తీయతీయని తేనె బిందువులు వాళ్ళు రుచిచూసి పులకరిస్తున్నారా? మంచి తల్లితండ్రుల సంరక్షణలో పెరుగుతున్న పిల్లలు హాయిగా, స్వేచ్ఛగా పూల పలకరింతల్లాగ పెరగాలి. మీ పిల్లలు అలాగున్నారా? లేకపోతే వాళ్ళు అనాథలు కాదా?***

***వాళ్ళకిష్టమైన చదువులు వాళ్ళు చదువుకోలేరు. పరాయిదేశాలొచ్చి ఏం చెబితే, వాళ్ళకు ఏది కావలిస్తే అది చదువుకోవాలి. వాళ్ళు అమెరికా వారి సంస్కృతీ సంప్రదాయాలు అలవాటు చేసుకోవాలి. మీరు చెప్పిన, చిన్న నాడు మీరు ఆడిన ఆటలు వారికి చెప్పలేరు. మీ పండగలు మీతోనే సరి, వాళ్ళు అమెరికా వారికి నచ్చిన పండుగలు జరుపుకుంటారు. మీ పిల్లల్ని మీరు కాకుండా అమెరికావాడో, ఇంగ్లాండువాడో పెంచుతాడు. మీ చేతుల్లో ఏమి లేనప్పుడు మీ పిల్లలు అనాథలు కాక ఏమవుతారు?"***

# 14. విద్య-విజ్ఞానం

– **నారాయణశర్మ,** అనంతపురం, సెల్ : 9490180695

'తమకు తెలిసిన సంగతులని తరువాతి తరానికి నేర్పటం' అనేక రకాల ప్రాణుల్లో కనిపిస్తుంది. బయలాజికల్‌గా అభివృద్ధి చెందిన జీవులు అన్నిటిలోనూ ఈ లక్షణం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. కోతులు తమ పిల్లలకు 'చాలా విద్యలు' నేర్పుతాయి. పిల్లులు, కుక్కలు, పక్షులు – ఇలా అభివృద్ధి చెందిన ప్రతీ జీవీ తన పిల్లలకు 'విద్యలు' నేర్పుతుండటం మన ఎరుకలో ఉన్నది.

తర్వాతి తరం సుఖంగా బ్రతకడం కోసం 'తమకు తెల్సిన సంగతులు' – ఈ మొత్తాన్నీ నేను 'విజ్ఞానం' అంటాను. విజ్ఞానాన్ని అందించటం ఇలా ఒక స్థాయిలో మౌలికమైన జీవలక్షణమే.

అయితే మనిషి పరిణామంలో ఇది పలు రకాల సంక్లిష్టతలకే తావిచ్చి ఉండాలి. ఆదిమ మానవులు తమ పిల్లలకు వేటాడటం, రకరకాల శబ్దాలు చేయటం నేర్పి ఉంటారు. తర్వాతి కాలం వారు భాషని, నాగరికతని పెంచుకొని, ఆయా జీవన అంశాలను విజ్ఞానానికి జమచేసి ఉంటారు. ఇలా, తరం మారిన కొద్దీ 'మనిషి పిల్లలు' తెలుసుకోవలసిన, నేర్చుకోవలసిన మొత్తం విజ్ఞానపు సమితీ సంక్లిష్టంగా పెరుగుతూ పోయింది. యంత్రయుగం వచ్చేసరికి పిల్లలు 'నేర్చుకోవలసిన' అంశాల మొత్తం ఎంత విస్తృతం అయి ఉండాలో ఊహించండి. ఆ సమయంలోనే, ఇంకా అంతకు చాలా ముందేనో మానవజాతి 'మొత్తం విజ్ఞానాన్ని "ఒక వ్యక్తి తన పిల్లలకు' నేర్పటం దాదాపు అసాధ్యం' అని గుర్తించి ఉండాలి. విజ్ఞాన సర్వస్వాన్ని పలు ముక్కలు చేసి, ఒక్కో ముక్కనీ కొందరు చొప్పున 'మాస్టర్'చేసి, వాటిని 'తమ పిల్లలకే' కాక 'ఇతరుల పిల్లలకు కూడా' అందే వ్యవస్థల్ని నిర్మించుకొనటం అలా మానవుల వైజ్ఞానిక పరిణామ క్రమంలో తప్పనిసరిగా వచ్చి ఉండవలసిన అంశం. 'స్పెషలైజేషన్' ఆ విధంగా మనుషులు విజ్ఞానపు సముదాయాన్ని 'ఆర్గనైజ్' చేసుకోవటాన్ని, ఆ 'క్రమం' అందించే సౌలభ్యం ద్వారా 'విజ్ఞానపు సెట్'కు మరింత విజ్ఞానాన్ని జమచేయటం జరుగుతూ పోయింది.

'ఆధునిక విజ్ఞానం'లో అలా లెక్కలేనన్ని అంశాలు, ఒక్కో అంశంలోనూ ఒక వ్యక్తి జీవితం సరిపోనన్ని భావనలు, నిర్మాణాలు ఏర్పడ్డాయి. ఆ ఆధారాలను ఉపయోగించుకొని జీవితంలో సుఖాన్ని, ఆలోచనల్లో ఔన్నత్యాన్ని పెంచుకోవటంలో అసమానతలు కూడా సహజంగానే తలెత్తుతూ ఉంటాయి. భౌతిక శాస్త్రవేత్త తన పిల్లలకు అందించగల ఆధునిక

వైజ్ఞానిక అంశాలని కూలివాడు తన పిల్లలకు అందించటం దాదాపు అసాధ్యం. అయితే సంక్లిష్టమైన యీ ప్రక్రియలో 'కూలివాడు తన పిల్లలకు అందించగల వైజ్ఞానిక అంశాలు' కూడా చాలా, భౌతిక శాస్త్రజ్ఞుడి పిల్లలకు దొరకవు.

"సమాజం భౌతిక శాస్త్రజ్ఞుడి విజ్ఞానానికి ఎక్కువ విలువిస్తుందా, కూలివాడి విజ్ఞానానికి ఎక్కువ విలువనిస్తుందా?' అన్న ప్రశ్నకు సమాధానం స్పష్టం. సమాజంలో ఏర్పడిన నిచ్చెనమెట్ల వ్యవస్థ విజ్ఞాన ప్రవాహంలో కూడా తనదైన ముద్ర వేస్తూనే ఉంటుంది.

ఈ క్రమంలో 'విజ్ఞానపు సెట్ చాలా పెద్దది', 'దానిలో చాలా విభాగాలు చేయక తప్పదు; అందరికీ విద్య నేర్పటం సాధ్యం కాదు, ఎవరైనా ఏవో కొన్నిమాత్రమే నేర్వగలరు, నేర్చినా వాటిని జీవితాలకు అప్లై చేసుకోవాలంటే తగిన 'సామాజిక పరిస్థితులు' ఉండాలి; ఇవేవీ లేనివారు, వారి పిల్లలు మరింత వెనుకబాటుకు లోనవుతారు. అంది పుచ్చుకున్నవారు అదృష్టవంతులు, పరుగుపెడుతున్న ఈ విజ్ఞాన ప్రవాహంలో దొరికినంత అందుకొని పరుగులెత్తకపోతే 'ఇతరులు' ఆ పనిచేస్తారు అన్నవి వాస్తవికంగా గుర్తించాల్సిన అంశాలు.

" 'చదువు అంటే ఏమిటి?' ని ఈ నేపథ్యంలోంచి చూడాలి" అని నాకు అనిపిస్తుంది. 'బహుశాఖలుగాను, అనంతంగాను విస్తరించిన విజ్ఞాన సముదాయంలోంచి చేతికి అందినన్నింటిని మూట గట్టుకోవటమూ, అదే క్రమంలో వాటి ఆధారంగా తమ జీవితాన్ని సుఖవంతం చేసుకోవటమూ – ఇది చదువు; 'చదువు నేర్చుకోవలసిన కారణం' కూడా ఇదే – జీవితాన్ని మరింత సుఖవంతం చేసుకోవాలంటే చదువు కావాలి. విద్యలు నేర్వాలి.

* * *

***"ఇంతమందిలోనూ ఒక్కడికీ కూడా జ్ఞానం కలగలేదు అనే సంతృప్తి ఆనాటి మా బడి పంతుళ్ళ మొగాల్లో కనిపించేది. ఇంక పర్వాలేదు... ఈ లోకాన్ని వీళ్ళు మనకంటే అధ్వాన్నంగా తయారుచేయగలరు అనే ఆనందం కనిపించేది. భూమి గుండ్రంగా వున్నప్పటికీ లోకం మాత్రం బల్లపరుపుగా వుందని చదువు పూర్తయ్యేసరికి పిల్లలకు అర్థం కావాలన్నదే విద్యావేత్తల లక్ష్యంగా వుండేది. ఇప్పుడు మరో అడుగు ముందుకు వేసి, భూమి గుండ్రంగా వున్నా, బల్లపరుపుగా వున్నా మనకి ఒక్కటేననీ, మన సంగతి మనం చూసుకోవాలిగానీ, భూమి ఎలాగ తగలడితే మనకేం అనీ చదువు పూర్తి అవకముందే పిల్లలకు తెలిసిపోతోంది."***

# 15. బ్రాహ్మణులు ఏ వృత్తి అయినా చేయవచ్చును కానీ, ఉపాధ్యాయ వృత్తి మాత్రం చేయరాదు - మహాత్మా ఫూలే.

– **రేకా చంద్ర శేఖర రావు,** హైద్రాబాద్, సెల్ : 9502 181 485.

బ్రాహ్మణులు ఏ వృత్తి అయినా చేయవచ్చును కానీ ఉపాధ్యాయ వృత్తి మాత్రం చేయరాదు.

ఈ మాట మహాత్మా ఫూలే ఎందుకన్నారు?

ఇది తెలుసుకునే ముందు బ్రాహ్మణులతో

ఆయన వ్యక్తిగత సంబంధాలు ఎలా వుండేవో చూద్దాం!

ఫూలేకు బ్రాహ్మణ స్నేహితులు అనేకమంది వుండే వారు, అందులో ఆయన సహాధ్యాయులైన ఇతర మిత్రులు వున్నట్లుగానే బ్రాహ్మణ మిత్రులు కూడా ఎక్కువ మందే వున్నారు, వారిలో కొందరు తన స్నేహితులు ద్వారా తన సామాజిక కార్యక్రమాలకు ప్రత్యక్ష, పరోక్ష సహకారాలు పొందేటంత స్నేహాన్ని కలిగి వున్నారు. తన సత్యశోధక సమాజానికి విరాళ మిచ్చిన మొదటి దాత కూడా బ్రాహ్మణుడే.

తాను, సావిత్రీబాయి ఫూలే నిర్వహించిన అనాధ స్త్రీల రక్షణ సంస్థలలో బ్రాహ్మణ స్త్రీలు కూడా వచ్చి వారి ఆశ్రయాన్ని పొందేవారు, అలా ఆశ్రయం పొందిన ఒక స్త్రీ, ఈ సమాజం చేసిన మోసానికి గురయిన ఒక బ్రాహ్మణ స్త్రీకి రక్షణ ఇచ్చి, ఆమెకు పురుడు పోసి బిడ్డను కాపాడారు. ఆ బిడ్డను ఆ స్త్రీ పెంచుకోలేని అశక్తతను చూసి వారే ఆ బిడ్డను దత్తత తీసుకుని, ఆ బిడ్డకు యశ్వంత్ అని పేరు పెట్టి, పెంచి పెద్ద చేసి డాక్టరును చేశారు. ఆ డాక్టరు యశ్వంత్ ఆ తర్వాత కాలంలో తన తల్లి సావిత్రి బాయి ఫూలే తో పాటు ప్లేగు వ్యాధి బాధితులకు సేవచేస్తూ మొదట తల్లి, తర్వాత యశ్వంత్ ఆ ప్లేగు వ్యాధి బాధితులయి మరణించారు. ఇంకా బ్రాహ్మణులతో వివిధ సందర్భాలలో అనేక అవమానాలకు ఫూలే గురయినప్పటికీ ఎప్పుడూ ఫూలే బ్రాహ్మణ ద్వేషాన్ని ప్రకటించలేదు.

పైన చెప్పిన ఆచరణ కలిగిన ఫూలే మరి బ్రాహ్మణులు ఎందుకు ఉపాధ్యాయులుగా వుండరాదు అన్నారు. కొత్త జాతిని, మానవీయ భారత జాతిని తయారు చేసే అత్యంత గొప్ప వృత్తి ఉపాధ్యాయ వృత్తి. అలాటి వృత్తిలో చిన్నప్పటి నుంచి వేదాధ్యయనం పేరుతో, జంధ్యం పేరుతో మడి– దడిని పాటిస్తూ పెరిగిన లేక పెరగవలసి వచ్చిన వారు, వారి మానసిక స్తితి– భావజాల స్తితి అంతా వాటి చుట్టూతానే వుంటుంది.

అందుకని అలాటి వారు ఉపాధ్యాయులు అయితే వారిలో ఇమిడి పోయిన బ్రాహ్మణీయ మనువాద భావజాలాన్ని, చెప్ప వద్దని, చెప్పకూడదని ఎంత నిగ్రహించుకున్నా

కూడా ఆ భావజాలాన్ని చెబుతారు. కొంత మంది అరుదయిన గొప్పవారు వ్యక్తులుగా మినహాయింపుగా వుంటారు, ఇక ఉద్దేశ పూరితంగా చెప్పాలను కునేవారు అదే పనిగా విద్యార్ధులకు అమానవీయ భావజాలాన్ని గొప్పవని చెబుతారు, చెబుతూ విద్యార్ధులను మూఢులుగా తయారు చేస్తారు.

**ఎలా అంటే!**

శూద్ర శంబూకుడి తల రాముడు నరకడం వీరోచిత చర్యగాను, పరశురాముడు రాజులనందరనీ చంపడం శాంతి కోసమని, ఏకలవ్యుడి బొటన వేలును ఖండించడం గొప్ప విషయంగా గురుదక్షిణ కోసం ప్రాణాలయినా ఇవ్వాలని, అహల్యను మోసం చేయడం, తాటకిని చంపడం, శూర్పణఖ ముక్కు – చెవులు కోయడం, గర్భిణీ అయిన సీతను అడవికి పంపడం తప్పనిసరి గొప్ప పనులని బలి చక్రవర్తిని మోసం చేసి అణచి వేయడం, రావణుడు, వాలి వంటి మహా బలవంతులను అక్రమంగా చంపడం గొప్ప వీరోచిత చర్యగాను చెబుతారు. సంభవామి యుగే యుగే పేరుతో దేవుడే అనార్యులను, ద్రావిడులను, అసురులను చంపడం లోక కళ్యాణం కోసం తప్పనిసరి అవసరమని పాఠాలు బోధిస్తారని మన జాతిని నిర్వీర్యులుగా చేస్తారని భావించి బ్రాహ్మణులు ఉపాధ్యాయ వృత్తి తప్ప ఏదయినా ఇతర వృత్తి చేయాలని ప్రభుత్వాలు నిర్ణయం తీసుకోవాలని పూలే చెప్పారు, నిజంగా ఆయన చెప్పిన గొప్ప విషయాన్ని ఆనాటి పాలకులు తీసుకుని వుంటే మన జాతి ఈనాడు ఇంత పతన స్థితి వుండేది కాదనేది వాస్తవం.

**ఎంత పతనస్థితి అంటే !**

సమాజంలో అత్యంత తీవ్ర అణచి వేతకు గురవుతున్న ప్రజలే మనువాదాన్ని పాటిస్తూ, నిచ్చెన మెట్ల కుల వ్యవస్తలో తమ కింది వారికంటే తాము చాలా గొప్ప వారమని, పైనున్న వారు తమ కంటే గొప్పవారు అని భావించేటంత, గొప్పగా ఆ అన్యాయాలను న్యాయం అని పాటించేటంత.

జేజేలు!

మహాత్మా పూలేకి! జేజేలు!

తప్పక చదవండి పూలే– అంబేద్కర్ల సాహిత్యాన్ని.

* * *

# ముగింపు

భారతదేశంలో గతితార్కికత (Dilectics) ని గౌతమ మహర్షి ప్రతిపాదించా డంటారు. ఈయనే రాసిన 'హేతువాదానికి, 'కామసూత్రాల' రచన ద్వారా ప్రసిద్ధి చెందిన వాత్సాయనుడు వ్యాఖ్యానం రాసాడు. దానిని తెలుగులో అనువదించిన రాంషా 35 సం॥రాల క్రితమే ధర్మచక్ర పవర్ ప్రెస్, సామర్లకోట తరఫున ప్రచురించి ఆవుల సాంబశివరావు వంటి వారిచేత ముందుమాట రాయించి పి.వి. నరసింహారావుకి అంకితమిచ్చారు. అందులో విద్య, అవిద్యల మధ్య వ్యత్యాసాలు చెబుతూ, "సత్యాన్ని గ్రహింపజేసేది విద్య, అసత్యాన్ని గ్రహింపజేసేది అవిద్య, విద్య ప్రమాత్మక (Realistic) అయితే అవిద్య భ్రమాత్మక (illusory) మవుతుంది." అంటారు. (పేజి–188)

కాన విద్యని గురించిన సంవాదం ఇప్పటిది కాదు. పాశ్చాత్య పద్ధతుల పట్ల జిజ్ఞాస కూడా చాలా పూర్వం నుండే ఉన్నది. ప్రఖ్యాత పండితులు రూపనగుడి నారాయణరావు గారి మేనమామ హొసూరు సుబ్బారావుగారు చాలా కాలం క్రితమే 'హెర్బర్ట్‌స్పెన్సర్ ఆన్ ఎడ్యుకేషన్' అనే గ్రంధాన్ని 'విద్యాభ్యాస పద్ధతి' అనే పేర గీర్వాణ భాషలోకి అనువదించారనీ, అది దేశమంతా వ్యాపించిందంటారు తిరుమల రామచంద్ర తన స్వీయ చరిత్ర 'హంపీ నుండి హరప్ప దాక'లో (పేజి–163).

ఇలా చెప్పుకుంటూ పోతే అనేక అంశాలు వస్తాయి. ఎప్పట్నుంచో విద్యాసంబంధిత విషయాల గురించిన చర్చకోసం ఔత్సాహికులతో చేయాలని తపించిన ప్రయత్నం తాలూకు చిన్న జాడ మాత్రమే ఇది. ఇంతకంటే సమగ్రమయిన కృషి ఈ క్రమంలో జరగడం చాలా అవసరం అనేది నా అభిప్రాయం. ముఖ్యంగా అణగారిన వర్గాల ప్రజల గురించిన స్పృహ ఇక్కడ అవసరం. టి. విజయేంద్ర దానినే Pedagogy of the poor అంటారు.

ఈ భావన ప్రజామార్గంలో సాధన చేయడమే విద్య లక్ష్యం.అందుకు ఈనాటి పౌరులందర్నీ సుముఖులను చేయడమే సామాజిక కార్యకర్తలు, ఉపాధ్యాయులు, విద్యావేత్తల లక్ష్యం. "35 సం॥రాల ఉపాధ్యాయ వృత్తిలో విద్యార్థులతో నాకు తెలియని దాన్నితెలియదని చెప్పడానికి ఎన్నడూ సంకోచించలేదు. కాక – తెలియని దాన్ని తెల్సినట్టు చెప్పడానికి ఎన్నడూ సాహసించలేదు నేను!" అంటారు ఆలూరి భుజంగరావు తన ఆత్మకథ 'గమనాగమనం'లో (పేజి–28).

మనిషికి ద్వేషరాహిత్యమే లక్ష్యం, అందుకు జ్ఞానార్జనే ముఖ్యం. ఆ దశకు ఉప కరించేదానినే విద్య అంటాం. స్వదేశి – విదేశి విధానాలపై గందరగోళం పడి ప్రయోజనం

లేదు. వీటైనంత విశిష్టతను సమిష్టిగా సాధించడమే విద్య. అధ్యయనము, అనుభవము, అనుభూతి, ఆచరణ, ఆలోచన, అభినివేశం అన్నీ అందులో భాగమే. "రెండు వందలేళ్ళ విదేశీ పరిపాలన విద్య మనను ముందుకే నెట్టింది కానీ వెనుకకు పంపలేదేమో అనిపిస్తుంది. ఇంగ్లీషు విద్య మనను గుమస్తాలుగా చేయడానికి మాత్రమే పనికి వచ్చింది అనడం సొంతం సత్యం కాదు." అంటారు సంజీవ్‌దేవ్ తన స్వీయచరిత్ర 'తుమ్మపూడి'లో (పేజి–397).

ఏది ఏమైనా అనేక ఆలోచనాత్మక ప్రయోగాలు, నూతన అభిరుచుల వైపుగా సృజనాత్మక మానవీయ విద్య కొరకు సాగుతున్న యత్నాల సఫలతను మనసారా కోరుకుంటూ ప్రతీ మనిషికి సమాన విలువకోసం జీవితాంతం సంఘర్షణ సల్పిన అంబేద్కర్ ఆశయ సాధనలో భాగంగా ఆయన వాక్కుల్ని స్మరిస్తూ ఇక్కడికిలా ఆపుతాను;

"My final words of advice to you is:
Educate, Agitate and Organize:
have faith in yourself."

– Dr. B.R. Ambedkar.

* * *

***"మనకి సిగ్గులేదు. మనకి సిగ్గుంటే మన పిల్లల్ని, మన స్త్రీలని ఇంత ఘోరంగా అవమానిస్తూ, ఇంత భయంకరంగా అణగదొక్కుతూ, ఇంత నీచంగా ప్రవర్తిస్తూ కూడా నవ్వుతూ వీధుల్లో తిరగ్గలమా? మనకి సిగ్గనేదే ఉంటే బొమ్మల పెట్టెతో, లక్క పిడతల బుట్టతో పద్నాలుగేళ్ళ చిన్నారి తల్లుల్ని సంసారాలకి పంపగలమా? మనకి సిగ్గనేదే ఉంటే వేడుకగా పదిమందినీ పిలిచి, పట్టుబట్టల గరగరలతో, మేళ తాళాలతో, వేద మంత్రాలతో పద్నాలుగేళ్ళ పిల్లల్ని గర్భాదానం గదిలోకి తోసి తలుపులకు గొళ్ళెం పెట్టి కిలకిల నవ్వగలమా? మనకి సిగ్గనేది ఏ కోశాన ఉన్నా పాలబుగ్గల గర్భవతులకు సూడిదలు పంపగలమా? సీమంతపు వేడుకలు జరుపగలమా"***